## శాండల్ చిటుపటులు మీ కోసమే!

12-3+4 = ?

12÷2-2 = ?

4x2-6+2 = ?

36-24÷3 = ?

5+8-1÷4 = ?

8x6÷12 = ?

9+9-2÷2 = ?

7x4-12 = ?

MAHE.

చిన్నారి చిన్నూ ఈ మహారణ్యంలో గంధపు వృక్షాలకోసం వెతుకుతున్నది. కానీ, ఎంతకూ గుర్తించలేకపోతున్నది. అయితే వాటిని గుర్తించడానికి ఒక సులభమార్గం ఉంది. ఆ చెట్లమీద అంకెల పజిల్స్ ఉండడం గమనించారు కదా? ఆ పజిల్స్‌ను పరిష్కరించండి. సమాధానం 4 వచ్చే చెట్లన్నీ గంధపు వృక్షాలన్నమాట! ఇప్పుడు మీరు చిన్నూకు సాయం చేయగలరా?

**అంకె 4 కూ గంధపు చెక్కలకూ మధ్య ఉన్న సామ్యం ఏమిటో తెలుసా?**

ఇదన్నమాట అది: మీరు
4 మైసూర్ శాండల్ సబ్బులను కొన్నట్లయితే
మీకు
2 క్రేజీ బౌన్సింగ్ బాల్స్




ఉచితం! *

* ఈ సదవకాశం
స్టాకులు ఉన్నంతవరకు
ఒక్క ఆంధ్రప్రదేశ్‌కు
మాత్రమే పరిమితం!
అందుకే త్వరపడండి.

మరింత పరిశుభ్రతకూ ఆరోగ్యానికీ
మైసూర్ శాండల్ సబ్బునే వాడండి.

మైసూర్ శాండల్ సబ్బు
గత 80 సంవత్సరాలుగా చందనం
శ్రేష్ఠతను మీ ఇళ్ళల్లోకి తీసుకువస్తోంది!



ACTIVE



BUZZ BOSS



CADET DX



DEVIL DX



ELEPHANT



FISH



GIRAFFE



HEN



INSECT



JOKER



KIDD DX



LI'L ANGEL LAMBADA LIMBO



MISSILE MISS INDIA Jr



NEST



ORANGE



PIRANHA



QUEEN Jr



ROBO COP



SPARKY SALSA



TERMINATOR




HTA.5979.2001

V W

The largest range of kids bikes

**HERO CYCLES**

THE ABC OF CYCLING

















## ఈ సంచికలో





**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
**Subscription Division**
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# ప్రేమ-కరుణ

కంటికి కనిపించకుండా వాతావరణాన్ని కలుషితంచేసి, మానవశరీరాలను వ్యాధిగ్రస్తంచేసే విషక్రిములను గురించి తరచూ వింటూ ఉంటాం. ఇవి ప్రకృతిలో పుట్టి గాలీ, నీరూ, మొక్కలూ, జంతువులద్వారా మానవశరీరాలలోకి ప్రవేశిస్తాయి. ఇలాటి అపాయకరమైన క్రిములను నియంత్రించి, నిరోధించి, నాశనంచేసే పద్ధతులను విజ్ఞానవేత్తలు ఎప్పటికప్పుడు కనుగొంటున్నారు. ఆరోగ్యానికి రక్షణ కల్పిస్తున్నారు.

అయితే, మరోరకం విషక్రిములు ఉన్నాయి. ఇవి అనారోగ్యకరమైన మానవ మస్తిష్కాలలో పుడతాయి. సిద్ధాంతాలనే ముసుగులు తగిలించుకుంటాయి. సిద్ధాంతం అంటే నిర్ణీతభావాలపట్ల అచంచల విశ్వాసం. ఆశయాల సాధనకు ఈ సిద్ధాంతాలు ఉపయోగపడతాయి. అయితే అన్ని సిద్ధాంతాలూ మానవకల్యాణానికి దోహదంచేయవు. కొన్ని మారణకాండకు ఆజ్యం పోస్తాయి. నిజానికి వీటిని సిద్ధాంతాలు అనడంకూడా సబబు కాదు.

ఉదాహరణకు ఈనాటి ఉగ్రవాదాన్నే తీసుకుందాం. ప్రపంచవ్యాప్తంగా అక్కడక్కడా ఏదో ఒక లక్ష్యం పేరుతో పడగవిప్పి, హింసాత్మకచర్యలతో భయోత్పాతం సృష్టిస్తోంది. అమాయక ప్రజాజీవితాలను అతలాకుతలం చేస్తున్నది!

మనం 21వ శతాబ్దంలో జీవిస్తున్నప్పటికీ, పలువురి మనసులలో మాత్రం 'కన్నుకు కన్ను, పన్నుకు పన్ను' అనే ఆటవిక సిద్ధాంతమే రాజ్యమేలుతోంది. పగ, ప్రతీకారం విలయతాండవం చేస్తున్నాయి. ఆ మనస్తత్వమే ప్రస్తుత దారుణస్థితికి కారణం.

మానవసంబంధాలకు పునాదులు ప్రేమ-కరుణ అన్న సత్యం కేవలం మాటలకు, రాతలకు మాత్రమే పరిమితమైపోయి, చేతలలో కరువైపోతున్నది. దానిని ఆచరణలోకి తీసుకురావాలి. అదొక్కటే తరుణోపాయం. ఎందుకుంటే-మానవ ప్రగతికేకాదు; మానవజాతి మనుగడకే అది జీవనాడి!

సంపాదకుడు : విశ్వం



# హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

## హీరోస్ ఆఫ్ ఇండియా - 5

భారత స్వాతంత్ర్యోద్యమంలో ఎందరో దేశభక్తులైన యోధులు పాల్గొన్నారు. వారిలో కొందరికి సంబంధించిన ప్రశ్నలు ఇక్కడ ఉన్నాయి. వారిని మీరు గుర్తించగలరా?

అన్నీ సరైన సమాధానాలుగల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!*

1. ఆయన భారత జాతీయసేనను (ఇండియన్ నేషనల్ యార్మీ) స్థాపించాడు. ఆయన పేరేమిటి?

---------------------------------------------

2. తమిళనాడుకు చెందిన ఈ స్వాతంత్ర్యయోధుడు బ్రిటిష్‌వాళ్ళన్ను ఎదిరించి సొంతంగా ఓడల కంపెనీ నడిపాడు. ఆయన ఎవరు?

---------------------------------------------

3. తన బాల్యంలో ఒకపులిని చంపడంవల్ల ఈ స్వాతంత్ర్య వీరుడికి ఒక బిరుదనామం ఏర్పడింది. ఆయన ఎవరో మీకు తెలుసా?

---------------------------------------------

4. ఆయనా, ఆయన మిత్రులూ కలిసి బ్రిటిష్ వాళ్ళను ఎదిరించి పోరాడేందుకు, ఆయుధాలు కొనడానికి బాజ్‌నగర్‌వద్ద రైలును ఆపి, ఖజానాపెట్టెను అపహరించుకుని వెళ్ళారు. ఆ వీరుడు ఎవరు?

---------------------------------------------

5. నానాసాహెబ్ సేనకు నాయకత్వం వహించి, బ్రిటిష్ వాళ్ళనుంచి కాన్పూరును పట్టుకున్నాడు. 1857 తిరుగుబాటు సమయంలో ఝాన్సీరాణి గ్వాలియర్‌ను పట్టుకోవడానికి సాయపడ్డాడు. ఆ యోధుడి పేరేమిటి?

---------------------------------------------



ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపిన చోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన మీ జాతీయయోధుడు ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పదిపదాలకు మించకుండా రాయండి.

నా అభిమాన జాతీయయోధుడు:

.....................................................................

.....................................................................

పాల్గొనేవారి పేరు: ..........................................

వయసు:.............తరగతి: ..........................................

చిరునామా:..........................................

.....................................................................

పిన్: ........................ ఫోన్: ........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం:......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 మార్చ్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

**హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-5**
**చందమామ ఇండియా లిమిటెడ్**
**82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ**
**ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.**

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు



# పాఠకుల లేఖలు

కథలకు తగిన బొమ్మలతో చదువుతున్నంత సేపూ పిల్లలే కాదు పెద్దలుకూడా ఆప్యాయంగా అక్కున చేర్చుకోవాలనిపిస్తుంది. ఇదే పంథాలో మునుముందు కథలనూ, వాటిలోని భావాలకు సూటిగా హత్తుకుపోయేలా కనిపించే చిత్రాలనూ ఇలాగే కొనసాగించండి. చందమామ గమనంలో మార్పులేనట్టే ఈ చందమామ కూడా ఇలాగే వెన్నెలలు కురిపించాలి. మనదైన బాణీలో మనం పయనిద్దాం. అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ చందమామ మానవాళికి మార్గదర్శకం కావాలన్నది మా ఆశ.. ఆకాంక్ష.

**-కొండరఉమామహేశ్వరరావు,తెనాలి-2 ( ఆం.ప్ర)**



చందమామలో కథలకు ప్రాధాన్యత తగ్గింది. జనరల్ నాలెడ్జ్‌కి పెంచారు. దానికి ప్రస్తుతం మార్కెట్లో చాలా పుస్తకాలు ఉన్నాయి. చిన్నపిల్లలు, పెద్దవాళ్ళు చదువుకునే పుస్తకంగా చందమామకు ఒక ప్రత్యేకస్థానం ఉంది. దానిని పదిలంగా ఉంచాలని నేను ఆశిస్తున్నాను. **-రోహిణి మహేష్,గుంటూరు-522 004**

చందమామను పునరుద్ధరించిన తరవాత దానిని ఎంతో శ్రద్ధతో మరింత మెరుగుపరచి ప్రచురిస్తూ ఉండడం సంతోషాన్ని ఇస్తున్నది. ప్రవేశపెట్టిన కొత్తశీర్షికలు ముఖ్యంగా భారత సంస్కృతి-చరిత్ర, భారతదర్శనం; బాలల రచనలతో- చిత్రాలతో వెలువడుతూన్న బాలలదినోత్సవసంచికలూ ఆహ్లాదకరంగా ఉన్నాయి. అందులోనూ భారతసంస్కృతి- చరిత్రపిల్లలకు ఎంతో ఉపయోగకరంగా ఉంటోంది. దేశచరిత్రను గురించిన సరియైన అవగాహనను వారిలో కలిగించడానికి ఇది ఎంతో ఉపయోగపడుతుంది.

డిసెంబర్ 2001 సంచికలో ప్రచురించిన ఓరాన్ జానపద కథ (నక్కతీర్పు) మొదట చేర్చిన ఓరాన్‌తెగ ప్రజల స్వస్థలం గురించీ, వారి తెగను గురించీ రాసిన వ్యాఖ్యలలో ''వారు ద్రావిడ జాతికి చెందిన ముఖ్యమైన ఆదిమ తెగలలో ఒకదానికి చెందినవారు''గా చెప్పారు. ఆర్యులు-ద్రావిడులు అనే జాతులే కల్పనలని గుర్తించిన తరవాతకూడా ఇటువంటి అసంగతమైన వ్యాఖ్యలు చదవడం చాలా బాధాకరంగా ఉన్నది. అటువంటి వ్యాఖ్యలు ప్రచురించడంలో మరింత జాగ్రత్త వహించవలసిందిగా కోరుతున్నాను.

**-శేషాద్రిరావు,హైదరాబాద్-500 028**

*[ఓరాన్ జానపద కథకు పరిచయంగా తెలియజేసిన విషయాలు వివాదాలకు ఆస్కారం లేని, అందరూ అంగీకరించిన అంశాలే. వివాదాలకు దూరంగా ఉండడమే మన పత్రిక సంప్రదాయం అన్నది అందరికీ తెలిసినదే. - సం.]*

మీ డిసెంబర్ 2001 సంచిక చదివాను. అందులో మన పండుగలు శీర్షికన 'క్రిస్మస్' పండుగ గురించి రాస్తూ ఏసుక్రీస్తు క్రైస్తవ మతాన్ని స్థాపించాడు అని రాశారు. ఆయన మత స్థాపకుడు కాదు. ఆయనకు తరవాత అనేక సంవత్సరాల అనంతరం క్రైస్తవమతం ఆరంభమయింది. పండుగ సందర్భంగా మీరు ప్రచురించిన విషయాలకై అభినందనలు. కాని, విషయ పరిజ్ఞానం కలిగినవారితో రాయిస్తే మరీ బాగుంటుంది.

**-కె.డి.రత్నరాజ్, హైదరాబాద్ - 500 070**

*['క్రైస్తవమతం' అనే పేరు ఏర్పడింది క్రీస్తు తరవాతే అయినా, ఏసుక్రీస్తు బోధనలు ఆధారంగానే క్రైస్తవమతం ఏర్పడింది. కొన్ని ఇతర మతాలకు కూడా ఇది వర్తిస్తుంది. - సం.]*



# నాకేంలాభం?

కోటిపల్లిలో తిమ్మయ్య అనే వ్యాపారి ఉండేవాడు. అతడు పరమ దురాశాపరుడు. ధనికుడే కానీ కరుడుకట్టిన స్వార్థబుద్ధి కలవాడు. తనకు లాభం లేనిదే ఏపనీ చేసేవాడు కాదు.

పక్క ఊరి నుంచి బతుకుతెరువుకు ఆ ఊరికి వచ్చిన చెన్నయ్య అనే వ్యక్తి తన కుటుంబంతో, తిమ్మయ్య ఇంట్లో కొత్తగా అద్దెకు దిగాడు.

ఒక రోజు తిమ్మయ్య అంగడి నుంచి ఇంటికి వస్తూంటే చెన్నయ్య కూతురు పన్నెండేళ్ళ మీనాక్షి ఎదురుపడింది.

''ఏమిటమ్మా ఇలా వచ్చావు?'' అని అడిగాడు తిమ్మయ్య.

''కొబ్బరి బోండాలు కొట్టుకోవడానికి మీ ఇంట్లో కత్తి అడిగి తీసుకువెళ్ళాను. పని అయిపోయింది. ఇవ్వడానికి వచ్చాను,'' అన్నది మీనాక్షి. తిమ్మయ్య చిరుకోపంగా, ''నువ్వు చేసిన పని ఏం బాగా లేదు తల్లీ. కత్తయితే ఇచ్చావుగానీ, మరి ఆ కత్తి వాడుకున్నందుకు నాకొక కొబ్బరి బోండాం అయినా ఇచ్చావా?'' అన్నాడు.

వెంటనే ఆ అమ్మాయి వాళ్ళ ఇంట్లోకి పరిగెత్తి పోయి, ఒక కొబ్బరి బోండాం తెచ్చి తిమ్మయ్యకు ఇచ్చింది.

రెండు రోజులు గడిచాయి. మూడో రోజు మధ్యాన్నం భోజనానికి వచ్చిన తిమ్మయ్య అక్కడ మీనాక్షిని చూసి, ''ఏమిటి సంగతి?'' అని అడిగాడు.

''ఈ రోజు పండుగ కదా మామయ్యా! పిండివంటలు చేసుకోవడానికి అమ్మ తెమ్మని చెప్పిందని మీ ఇంట్లో నుంచి బాణలి తీసుకు వెళ్ళాను. పని అయిపోయింది. బాణలి ఇవ్వడానికి వచ్చాను,'' అన్నది మీనాక్షి నవ్వుతూ.

''హు.. బాణలి ఇచ్చావుగానీ, మరి దానిని వాడుకున్నందుకు ఏం తెచ్చావు తల్లీ?'' అని అడిగాడు తిమ్మయ్య నిష్ఠూరంగా.

కోలపల్లి ఈశ్వర్

మీనాక్షి నాలుక్కరుచుకుని, ''ఒక్క నిముషం,'' అంటూ వెంటనే వాళ్ళ ఇంట్లోకి పరిగెత్తిపోయి, ఒక గిన్నెలో గారెలు, బూరెలు తెచ్చి తిమ్మయ్యకు ఇచ్చింది.

తిమ్మయ్య సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బవుతూ, మీనాక్షిని ఆప్యాయంగా దగ్గరికి తీసుకుని వీపు తడుతూ, ''బావుంది... ఇక నుంచి నాచేత అడిగించుకో కూడదు. ఏదైనా వస్తువు మా ఇంటి నుంచి తీసుకువెళితే, అది వాడుకున్నందుకు ఏదైనా ఇచ్చావనుకో, నాకు చాలా సంతోషంగా ఉంటుంది, తెలిసిందా?'' అన్నాడు.

మీనాక్షి తెలిసిందన్నట్టు తలాడించి, నవ్వుతూ అక్కడి నుంచి చరచరా వెళ్ళిపోయింది.

వారు రోజుల తరువాత, ఏదో పనిమీద పక్క ఊరికివెళ్ళి అప్పుడే తిరిగి వస్తున్న తిమ్మయ్య, తన ఇంట్లోంచి వస్తూన్న మీనాక్షిని చూశాడు.

''ఏం మీనాక్షీ! ఏదైనా తిరిగి ఇవ్వడానికి వచ్చావా?'' అన్నాడు ఆశగా నవ్వుతూ.

''అవును, మామయ్యా! తిరిగి ఇవ్వడమే కాదు, మీరు చెప్పినట్టుగా, మీరు అడగకముందే మిగతా పనికూడా పూర్తి చేశాను,'' అన్నది మీనాక్షి.

'' ఇంతకూ ఏం తీసుకెళ్ళావు?'' అని అడిగాడు తిమ్మయ్య.

'' ఎలుకల బోను. మా ఇంట్లో ఎలుకల బెడద ఎక్కువగా ఉంటే పట్టుకెళ్ళాను. పని అయిపోయింది. బోను తీసుకెళ్ళినందుకు మీకేదైనా ఇవ్వాలికదా! అందుకే బోనులో పడ్డ రెండు పెద్ద ఎలుకలను మీ ఇంట్లో వదిలి, బోను మీ అబ్బాయికిచ్చాను,'' అంటూ వెళ్ళిపోయింది మీనాక్షి.

తిమ్మయ్యకు బుర్ర తిరిగిపోయింది. ఒక్క క్షణం నోట మాట రాలేదు. అయితే, ఈ సంఘటన తరవాత తిమ్మయ్యలో క్రమంగా మార్పువచ్చింది. ఏ పనిచేసినా నాకేం లాభం? అని ఆలోచించే ధోరణిని వదులుకున్నాడు. నలుగురిలో మంచిపేరు తెచ్చుకున్నాడు.



ORISSA
*The soul of India*

మీకు ఒక క్విజ్

# కోరాపుట్

ప్రకృతిని ప్రేమించేవాళ్ళు కోరాపుట్‌ను తప్పకుండా ప్రేమిస్తారు. ఒరిస్సాలోని కోరాపుట్‌జిల్లా ప్రకృతి సౌందర్యానికి నిలయం. సుప్రసిద్ధ దండకారణ్యం అడవుల సమీపంలో సముద్రమట్టానికి 2,990 ఎత్తులో ఇది ఉన్నది.

కోరాపుట్ జిల్లా వాణిజ్య కేంద్రమైన జైపూర్ చుట్టూ అందమైన జలపాతాలూ, వన్యసంపదలతో నిండిన అడవులూ ఉన్నాయి. చుట్టుపక్కల ఉన్న వివిధ పర్యాటక కేంద్రాలకు వెళ్ళడానికి కూడా అనువైన స్థలం కోరాపుట్.

జైపూర్‌కు 70 కి.మీ. దూరంలో మాచ్‌కుండ్ నదిలో ఉరుకుతున్న అందమైన డుడుమా జలపాతం కనుల విందు చేస్తుంది.

ఈ ప్రాంతంలోని మరొక ఆసక్తికరమైన పర్యాటకకేంద్రం గుప్తేశ్వర్. ఇక్కడి అందమైన ప్రకృతిదృశ్యాల మధ్య గుప్తేశ్వర ఆలయం అనే శివాలయం ఉంది. ఇక్కడి నుంచి జైపూర్‌కు 58 కి.మీ.

బరంపురం నుంచి కోరాపుట్‌కు వెళ్ళే మార్గ మధ్యంలో రాయగడ్ అనే జిల్లా రాజధాని ఉంది. ఇదికూడా ప్రకృతిశోభకు ప్రసిద్ధిగాంచిన ప్రాంతం. ఇక్కడికి 134 కీ.మీ. దూరంలో మినోఝోలా అనే మూడు నదుల త్రివేణీసంగమం ఉన్నది. అద్భుత ప్రకృతి సౌందర్యంతోపాటు అదొక పుణ్యక్షేత్రంగానూ పేరుగాంచింది. కోరాపుట్ విభిన్న కొండ తెగలవారికిస్వస్థలంగానూ ప్రసిద్ధిగాంచిన ప్రదేశం!

మీకు ఒక క్విజ్
**14–** ఏళ్ళ లోపు పిల్లలకు
పోటీ–**6**

1. కోరాపుట్‌జిల్లాపచ్చటి లోయలో ఒక 'ఏరో ఇంజన్ ఫ్యాక్టరీ' నెలకొల్పబడి ఉంది. అది ఎక్కడ ఉందో మీకు తెలుసా?

.................................................

2. ఆసియాఖండంలోనే అత్యధికంగా అల్యూమినియంతయారుచేసే నాల్కో(NALCO) కోరాపుట్ సమీపంలోనే ఉంది. ఆ ఫ్యాక్టరీ ఎక్కడ ఉందో తెలుసా?

.................................................

3. ఈ అందమైన ప్రాంతంలో నాగావళి నదిమీదరెండు జలపాతాలు ఉన్నాయి. ఇక్కడ విలక్షణంగా రూపుదిద్దుకున్న రెండు బ్రహ్మాండమైన బండలు చాలా ప్రసిద్ధిగాంచాయి. ఈ ప్రదేశం పేరేమిటి?

.................................................

మీ సమాధానాలను చుక్కలతో చూపినచోట స్పష్టంగా రాసి, కూపన్‌ను నింపి ఎంట్రీలను కింది చిరునామాకు పంపండి:

**Orissa Tourism Quiz Contest**
**Chandamama India Limited**
**No.82, Defence Officers Colony**
**Ekkatuthangal, Chennai - 600 097**

పేరు : .................................
వయసు : .................................
చిరునామా : .................................
.................................
పిన్ ......................... ఫోన్ ...........




Winners picked by Orissa Tourism in each contest will be eligible for **3 days, 2-night** stay at any of the **OTDC Panthanivas**, upto a maximum of four members of a family. Only original forms will be entertained. The competition is not open to CIL and Orissa Tourism family members. Orissa Tourism, Paryatan Bhaven, Bhubaneswar-751 014. Ph: (0674) 432177, Fax : (0674) 430887, e-mail : ortour@sancharnet.in. Website : Orissa-tourism.com




# మాయాసరోవరం

చాలాకాలం క్రిందట అమరావతీ నగర రాజుగారి ఆస్థానంలో, కులశేఖరుడనే రాజోద్యోగి వుండేవాడు. ఆయనకు జయ శీలుడనే ఒక్కగానొక్క కొడుకు. బాల్యంలోనే తల్లిని పోగొట్టుకున్న జయశీలుణ్ణి, కుల శేఖరుడు ఎంతో గారాబంగా పెంచాడు. జయశీలుడు ఇరవై ఏళ్ళ వయసువాడయ్యే సరికి, అన్ని విద్యలతో పాటు, క్షత్రియోచిత మైన యుద్ధవిద్యలలో కూడా ప్రవీణుడని పించుకున్నాడు.

కులశేఖరుడు తన కొడుకును రాజు గారికి పరిచయంచేసి, ఆస్థానంలో ఏదైనా ఉద్యోగంలో ప్రవేశపెట్టుదామని ఆలోచిస్తూం డగా హఠాత్తుగా జబ్బుచేసి, కొద్దిరోజుల్లోనే మరణించాడు.

జయశీలుడిప్పుడు ఒంటరివాడు. మంచీ, చెడూ చెప్పే పెద్దలెవరూ లేరు. అతడికి క్రమంగా దుర్వ్యసనాల్లో మునిగి తేలే కొందరు యువకులతో స్నేహం ఏర్పడింది. అతడు వాళ్ళతో కలిసి, తండ్రి వదిలిపోయిన ఆస్తిని విచ్చల విడిగా ఖర్చుచేస్తూ, త్వరలోనే జూదగృహాలకు వెళ్ళడం కూడా ప్రారం భించాడు.

ఈ విధంగా, తండ్రి పోయిన నాలుగ యిదు నెలల్లోపునే జయశీలుడు తనకున్న ఆస్తి అంతా పోగొట్టుకున్నాడు. ఆ దుర్దశలో అతడు ఒకసారి మూడురోజుల పాటు తిండి కూడా లేకుండా, మాసిన గుడ్డలతో వీధిలోకి వచ్చేందుకు సిగ్గుపడి, జూదగృహంలోనే ఉండిపోయాడు.

ఇది చూసిన దేవశర్మ అనే అతడి మిత్రుడు, జయశీలుడికి దుఃఖం మాని ముందుమార్గమేమిటో ఆలోచించమని చెప్పి, "జయశీలా! మనం ఆడే పాచికలు దరిద్రదేవత నేత్రాలనీ, బ్రహ్మ జూదగాడి ముఖాన, దుమ్మే పట్టుపరుపుగా, వీధులే ఇళ్ళుగా లిఖిస్తాడనీ, నీకు తెలిసినట్టు లేదు. నువ్వు విద్యావంతుడివి. దుఃఖిస్తూ



కూర్చోవడం ఎందుకు?'' అంటూ హితబోధ చేశాడు.

జయశీలుడు కొంచెంసేపు మౌనంగా ఆలోచిస్తూ వూరుకుని, ''దేవశర్మా, నువ్వు నిజమైన మిత్రుడివ్వదగిన సలహా ఇచ్చావు,'' అన్నాడు.

దేవశర్మ ఏదో జవాబివ్వబోయేంతలో, జూదగృహం ముందు కలకలం బయలు దేరింది. కృపాణజిత్తు అనే రాజుగారి అశ్వ దళనాయకుడు, వెంట మరి నలుగురు భటులు రాగా, జూదగృహం ప్రవేశించి, అక్కడ వున్నవాళ్ళను కొరడాతో ఎడాపెడా కొట్టసాగాడు.

ఇది చూసిన జయశీలుడు, ''అయ్యా, ఏమిటీ దురన్యాయం? మీ బోటివారికి ఇది ఏమాత్రం ధర్మం అనిపించుకోదు,'' అన్నాడు బాధగా.

''ఆహా, వ్యసనపరుడైన జూదరి నాకు ధర్మబోధ చేయటం! అద్భుతం!'' అంటూ కృపాణజిత్తు, జయశీలుణ్ణి కొరడాతో గట్టిగా కొట్టాడు.

జయశీలుడు దెబ్బ తగలగానే, చ్రున ఎగిరి, దాపులనున్న కర్రతో కృపాణజిత్తు తల మీద గట్టిగా మోదాడు. దెబ్బతింటూనే కృపాణజిత్తు అబ్బా అంటూ ఒక్క అరుపు అరిచి, కత్తి దూయబోయాడు. అంతలో జయశీలుడు అతడి నడుం మీద బలంగా ఒక్క తన్ను తన్నాడు.

కృపాణజిత్తు ఒక చావుకేక పెట్టి కిందపడి లేచి, తన గుర్రాన్కెక్కి పారిపోజూశాడు. అయితే, జయశీలుడు అతడి వెనకగా గుర్రం మీద దూకి, ఒకచేత్తో దాని కళ్ళాలు పట్టుకుని, రెండవ చేత్తో కృపాణజిత్తు జుట్టు పట్టుకుని, మోచేతులతో అతణ్ణి కుమ్మసాగాడు. గుర్రం అలవాటు ప్రకారం పోయి రాజభవనం ముందు ఆగింది.

ఆ సమయంలో, రాజుగారు భవనం పైభాగాన నిలబడి, మంత్రితో ఏవో సంప్ర తింపులు చేస్తున్నాడు. ఆయన నౌకరొకణ్ణి పిలిచి, ''నడివీధిలో గొడవచేస్తూన్న ఆ తాగు బోతు వెధవల్ని, నా దగ్గరకు తీసుకురా,'' అని ఆజ్ఞాపించాడు.

నౌకరు, కృపాణజిత్తునూ, జయశీలుణ్ణీ వెంటబెట్టుకుని రాజుగారి దగ్గరకు వచ్చాడు. రాజు తన అశ్వదళనాయకుణ్ణి గుర్తుపట్టి, ''జిత్తూ! నువ్వు, నా అశ్వదళనాయకుడివి. రాజవీధిలో గుర్రం మీద, సిగ్గుమాలిన ఈ దొమ్మరి విద్యాప్రదర్శన ఏమిటి?'' అని గద్దించి అడిగాడు.

కృపాణజిత్తు ఏమీ దాచకుండా జరిగిందంతా చెప్పాడు. అంతా విన్న రాజు కోపంగా, ''జిత్తూ! నీ పిరికితనం కారణంగా, నా సైన్యం అంతకూ తలవొంపులు తెచ్చావు. నీకిదే, దేశబహిష్కరణ విధిస్తున్నాను. కత్తి అక్కడ పెట్టి, తక్షణం దేశం వదిలి వెళ్ళిపో!'' అన్నాడు.

కృపాణజిత్తు కత్తిని నేలమీద పెట్టి, తల వంచుకుని వెళ్ళిపోయాడు. అప్పుడు రాజు జయశీలుడికేసి కొరకొర చూస్తూ, ''ఒరే, జూదరీ! నీకు శిరశ్ఛేద శిక్ష విధించాను. ఏమైనా చెప్పుకోవాలంటే చెప్పుకో,'' అన్నాడు.

తన దారిద్ర్యావస్థను తలచుకుంటూ, నిరాశా నిస్పృహల్లో వున్న జయశీలుడు, రాజు మాటలకేమీ భయపడక, ''మహారాజా! తమరు నాకు శిరశ్ఛేదం విధించాక, ఇక నేను చెప్పుకునేందుకేమున్నది?'' అన్నాడు.

''నీకు ప్రాణభయం లేదా?''అని అడిగాడు రాజు ఆశ్చర్యపోతూ.

''దారిద్ర్య భయం ముందు, ప్రాణ భయం ఏపాటి, మహారాజా!'' అన్నాడు జయశీలుడు.

''అవునవును. జూదం, వ్యసనాల తలమానికం, అన్నారు గదా పెద్దలు!'' అన్నాడు రాజు. అప్పుడు మంత్రి కల్పించుకుని, ''మహారాజా! ఈ యువకుడు, ఒకప్పుడు మన ఆస్థానంలో పనిచేసిన కులశేఖరుడి ఒక్కగా నొక్కకొడుకు. కులశేఖరుడు చనిపోయాడు. తమరు ఇతడిమీదకొంచెం కరుణ చూపాలి,'' అన్నాడు.

''అయితే, ఇతడికి శిరశ్ఛేదం కాదు, దేశ బహిష్కరణ శిక్ష విధిస్తున్నాను!'' అన్నాడు



రాజు. జయశీలుడు, రాజుకు నమస్కరించి వెనుదిరిగేంతలో, రాజు అతడితో, ''ఇదుగో, ఆ కృపాణజిత్తు వదిలిపోయిన కత్తి తీసుకో. ఒక్క వారం రోజుల లోపల, నా రాజ్యసరిహద్దులు దాటిపోవాలి, తెలిసిందా?'' అన్నాడు.

జయశీలుడు అప్పటికప్పుడు బయలుదేరి నగరం వదిలి, అరణ్యమార్గాలు పట్టి నడవసాగాడు. ఇలా అతడు ఒక వారం రోజులు ప్రయాణం చేసి, అరణ్యంలో దొరికిన కాయలూ, పళ్ళూ తింటూ, ఒకనాటి సూర్యాస్తమయవేళకు, మరొక దేశం రాజధానీనగర పరిసరాలకు చేరాడు.

ఆ రాత్రికి జయశీలుడు అక్కడ వున్న ఒక పెద్ద ఊడలమర్రి కింద కాలం గడపదలిచి చెట్టు పాదంలో భూమినుంచి పైకి వచ్చిన, ఒక లావుపాటి వేరును తలగడగా పెట్టుకుని పడుకున్నాడు. కొంతసేపటికి



అతడికి నిద్ర ముంచుకు వచ్చింది. సరిగ్గా నడిరేయివేళ, దాపుల నక్కల కూతలు విని, అతడు కళ్ళు తెరిచాడు. కొంచెం దూరంలో చెట్ల చాటు నుంచి చిన్న వెలుగూ, పొగా అతడి కంటబడినై.

జయశీలుడు ఆశ్చర్యపోతూ అటుకేసి చూసేంతలో, "రక్షించండి! రక్షించండి! మహాకాలుడు మింగజూస్తున్నాడు," అన్న ఆర్తనాదం వినిపించింది.

జయశీలుడు చప్పున లేచి, కత్తి దూసి, ఆ ఆర్తనాదం వచ్చిన వైపుకు పరిగెత్తాడు. అదొక శ్మశానం! రెండు, మూడు శవాలు చితుల్లో కాలుతున్నవి. ఆ మంటల వెలుగులో, నల్లటి వస్త్రాలు ధరించి, జుట్టు విరబోసుకుని ఆర్తనాదాలు చేస్తూ పరిగెత్తుతున్న మనిషి ఒకడు, అతడికి కనిపించాడు. నిలువెల్లా తెల్లని వస్త్రం కప్పుకున్న ఆకారం ఒకటి, అతణ్ణి వెంటబడి తరుముతూ,

"ఆగు! ఆగు! మహాకాలుడి బంటునైన ఈ కాలకాలుడిని చూసే భయపడే నువ్వు, మహాకాలుణ్ణి ఆవాహన చేయచూస్తావా?" అని అరుస్తున్నది.

జయశీలుడు, ఆ కాలకాలుణ్ణని చెప్పుకునేవాణ్ణి అడ్డగించి, "ఓరీ, నువ్వెవరైనా నాకు భయంలేదు. కానీ, వెన్నిచ్చి పారిపోయేవాణ్ణి, వెంటబడి తరిమి చంపాలని చూడటం మాత్రం సహించను!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే కాలకాలుడు వికృతంగా నవ్వి, "మెచ్చితిరా యువకుడా, ఏదీ నా నిజరూపం చూడు!" అంటూ కప్పుకున్న తెల్లవస్త్రాన్ని తీసి దూరంగా విసిరివేశాడు.

ఇప్పుడా కాలకాలుడి రూపం అతి భయంకరంగా వున్నది. నల్లని శరీరచ్ఛాయతో, నిప్పులు చెరుగుతున్న కళ్ళతో, నోట మంటలు కక్కుతూ అతడు భయంకరంగా గర్జన చేశాడు.

జయశీలుడు ఒక్క తృటికాలం నిశ్చేష్టుడయ్యాడు. కానీ, అంతలోనే తెప్పరిల్లి, కత్తిని కాలకాలుడి గుండెలకేసి గురిచేసి, "దుష్టుడా! నీ వికృతాకారానికి నేను భయపడతాననుకోకు! పారిపోయేవాణ్ణి చంపచూసే నీవు, ఏ రకం పిరికిపందవై వుంటావు?" అని అడిగాడు.

కాలకాలుడు ఒక్కడుగు వెనక్కువేసి, "యువకుడా, నీ ధైర్యానికి మెచ్చాను. అమానుషశక్తుల్ని, మహాసత్త్వాలు మాత్రమే అధీనంలో వుంచుకోగలరు. ఇప్పుడు నన్ను ఆవాహనచేసిన సిద్ధసాధకుడు అల్పసత్త్వుడు! అలాంటి వాణ్ణి ప్రాణాలతో వదలరాదు. అడ్డం తొలగు!" అంటూ ముందుకు దూకబోయాడు.

జయశీలుడు కత్తిని, కాలకాలుడి వక్షానికి అడ్డుగా పెట్టి, సిద్ధసాధకుడు ఎక్కడ ఉన్నాడో అని వెనక్కు తిరిగి చూశాడు. అంతలో కాలకాలుడు హుమ్, అంటూ కత్తిని చేత్తో పక్కకు నెట్టాడు.

జయశీలుడు చప్పున కాలకాలుడి కంఠాని కేసి కత్తి విసిరాడు. ఆ దెబ్బకు వాడి తల మొండెం నుంచి వేరయిపోయి, అంత దూరాన పడింది. మరుక్షణం తెగి కింద పడిన తల ఎగిరెగిరి పడుతూ, బిగ్గరగా నవ్వి, "జయశీలా! నిస్సంశయంగా నువ్వు మహా సత్త్వుడివి. నా కంఠరక్తంతో తడిసిన నీ కత్తి, అమోఘ శక్తులుగలదవుతుంది. వెళ్ళు, నీవు కోరినవన్నీ ప్రయత్నించి సాధించుకో!" అన్నది.

జయశీలుడు ఆ మాటలకు అబ్బుర పాటు చెందాడు. అతడు తెగిపడిన తలను సమీపించి కత్తితో దాన్ని అటూ ఇటూ కదిపి చూశాడు; జీవం వున్నట్టులేదు. ఈ చచ్చిన వాడెవడోగాని మంచి బలాఢ్యుడు. చెవు లకూ, ముక్కులకూ వెండిపోగులూ; పుస్తె మీసాలూ, కంఠానికి గట్టిగా బిగించివున్న పూసలదండా, జయశీలుడి కంటబడినై.

అతడు కత్తిని తిరిగి ఒరలోపెట్టి, రక్షించ మంటూ పరిగెత్తిన నల్లటి దుస్తులవాడి కోసం చుట్టూ కలయజూశాడు. ఈసారి వాడెక్కడా వున్న సూచనలే లేవు. వాడేమైవుంటాడు? భయంతో గుండె పగిలి, ఈ చుట్టుపక్కల వున్న చెట్లకింద ఎక్కడైనా పడిపోలేదు కదా! ఇలా ఆలోచిస్తూ జయశీలుడు, తాను ముందు పడుకున్న ఊడల మర్రికేసి నడిచాడు.



ఇప్పుడు మర్రిచెట్టు కొమ్మల్లో గుడ్ల గూబల అరుపులతో పాటు, దూరంగా నక్కల కూతలు కూడా ప్రారంభమయినై. ఇక అక్కడ తాను నిద్రించటం సాధ్యపడ దనుకున్నాడు, జయశీలుడు. పైగా దాహంతో అతడి నాలుక పిడచకట్టుకుపోతున్నది.

"రాత్రి మూడవజాము గడిచినట్టున్నది! ఈ చుట్టుపక్కల ఎక్కడైనా కొలను లాంటిది వుంటే దాహం తీర్చుకుని, స్నానం చేసి తూర్పు తెల్లనవుతూండగానే నగరంలోకి పోవాలి. దుస్తులు చీలికలూ వాలికలూ అయివున్నా, నడుం నుంచి వేలాడుతున్న కత్తి ఒరమీదా, పిడిమీదా వున్న నగిషీ పని చూసి, నేనేదో గొప్ప కులీనుణ్ణనే జనం అనుకుంటారు. ఈ చిరుగు దుస్తులకు కారణం, అరణ్యంలో ఒక సింహాన్నెదుర్కొని హోరాహోరీగా పోరాడటం అని చెపుతాను!" అనుకుంటూ జయశీలుడు మర్రిచెట్టు



దగ్గరనుంచి బయలుదేరాడు. అతడు ఆ భయంకర శ్మశాన ప్రదేశాన్ని వదిలి కొంత దూరం నడిచేసరికి, ఒక చిన్న ఇల్లూ, ఆ ఇంటి కిటికీలోంచి వెలుగుతున్న దీపం అతడి కంటబడినై. ఆ ఇంటివారిని అడిగి ముందు దాహం తీర్చుకోవచ్చుననుకుంటూ, ''అయ్యా, నేను బాటసారిని. ఇంత మంచి నీరిచ్చి దాహం తీర్చగలరా!'' అని కేకపెట్టాడు.

వెంటనే ఇంటి తలుపు తెరుచుకున్నది. ఒకవృద్ధురాలు దీపం చేతబట్టుకుని, బయటి చీకటిలోకి చూస్తూ, ''బాబూ! చీకటిపడగానే, ఏ సత్రంలోనో పడుకుని నిద్రించక, ఇంత రాత్రివేళ ప్రయాణం చేస్తున్నావా? లోపలికి రా, మంచినీరిస్తాను,'' అన్నది.

జయశీలుడు లోపలికి వెళ్ళాడు. వృద్ధురాలు అతణ్ణి దీపపు కాంతిలో పరీక్షగా చూసి, ఆశ్చర్యపోతూ, ''నువ్వేదో వయసు మళ్ళిన, తీర్థయాత్రలకు పోయే బాటసారి వనుకున్నాను. అదేమిటి? ఇంత పిన్నవయసులో కత్తి నడుముకు కట్టుకుని, అర్ధ రాత్రివేళ ఈ అరణ్యప్రాంతాల్లో తిరుగుతున్నావు?'' అన్నది.

జయశీలుడు నీళ్ళుతాగి, ''అమ్మా, నా ప్రాణాలు నిలిపావు. ఇంటిలో మరెవరూ వున్నట్టులేదే!'' అన్నాడు.

''ఎవరూ లేరు, నాయనా! నాకు సంతానంకలగలేదు. నా భర్త సంవత్సరం కిందట చనిపోయాడు. ఆయన రాజాశ్రితుడు. నిరాధారురాలనైన నాకు, రాజుగారు, నా భర్త జీతంలో మూడోవంతు భరణంగా ఇస్తున్నాడు. దాని ఆధారంతో ఒంటరిగానే, ఈ ఇంట్లో కాలం వెళ్ళబుచ్చుతున్నాను,'' అన్నది వృద్ధురాలు.

''అమ్మా, నేనీప్రాంతాలకు కొత్తగా వచ్చిన వాణ్ణి, ఇక్కడికి దాపులలో వున్న నగరం పేరేమిటి? రాజుగారి పేరేమిటి?'' అని అడిగాడు జయశీలుడు.

ఆ ప్రశ్నకు వృద్ధురాలు చిన్నగా నిట్టూర్చి, ''అది హిరణ్యపురం. రాజుగారి పేరు కనకాక్షుడు. ఎంతో ప్రజాహితంగా రాజ్యపాలన చేసే ధర్మాత్ముడు. కానీ, ఆ మధ్య నెల రోజుల కిందట పెళ్ళీడుకొచ్చిన ఆయన కుమార్తెనూ, యౌవరాజ్య పట్టాభిషేకం చేసుకోనున్న ఆయన కుమారుణ్ణీ, ఎవరో అపహరించుకుపోయారు. ఆనాటినుంచీ రాజుగారు దిగులుతో మంచం పట్టారు,'' అన్నది.

కూతురూ, కొడుకూ కనిపించకుండా పోయిన దిగులుతో మంచం ఎక్కిన రాజును, ఉద్యోగం కోసం అర్థించటం ఎలా? అనుకున్నాడు జయశీలుడు. ఆ వెంటనే అతడికి

తన భుక్తిగడిచే మార్గంకన్నా, ముందు రాజుగారు పడ్డ చిక్కుల గురించి తెలుసు కోవాలనిపించింది.

''అమ్మా, రాజుగారి కొడుకూ, కుమా ర్తెల్నీ ఏ శత్రురాజో రహస్యంగా ఎత్తుకుపోయి వుంటాడు. అంతేగదా?'' అని అడిగాడు జయశీలుడు.

''అలా జరిగివుంటే చిక్కేమున్నది, నాయనా! శత్రురాజును చంపి కనకాక్ష రాజుగారు, తన పుత్రీ పుత్రుల్ని ఇంటికి తెచ్చుకునేవాడు. ఆ ఎత్తుకుపోయినవా డెవడో రాక్షసుడో, యక్షుడో అనుకుంటు న్నారు,'' అన్నది వృద్ధురాలు.

ఆమె మాట ముగించే లోపలే ఇంటి ముందు కలకలం బయలుదేరింది. ఒకడు ఏడ్పు గొంతుతో, ''అయ్యా, శ్మశానంలో నా తండ్రి తల నరికినవాడు ఇటే రావడం నా కళ్ళారా చూశాను. ఈ బ్రాహ్మణావిడ ఇంట్లో దీపం వెలుగుతున్నది. ఆమె ఏమైనా వాణ్ణి చూసిందేమో అడగండి,'' అంటున్నాడు.

''ఒరే, కాటికాపరి మెధవా, నోరు మూసుకో! ఆ మహావీరుడు తల నరికింది, భూత ప్రేతాలకు పెద్దనని చెప్పుకునే కాలకాలుణ్ణి. సిద్ధ సాధకుణ్ణయిన నాకు, ఇలాంటివి క్షుణ్ణంగా తెలుసు!'' అంటున్నాడు మరొ కడు కోపంగా.

వాళ్ళిద్దర్నీ పెద్దగా గదమాయిస్తూ మరొక గొంతు, ''మీరిద్దరూ కాస్త నోళ్ళు మూయండి. చచ్చిన ముసలి కాటికాపరి మళ్ళీ ఎలా బతికాడు, అన్నదానితో పాటు సర్వం విచారించమని నగర రక్షకుణ్ణయిన నన్ను, మంత్రిగారు పంపారు. నాకు అడ్డు రాకండి!'' అన్నది.

ఈ సంభాషణ విన్న జయశీలుడు, వృద్ధు రాలిని, ''అమ్మా, నా కోసం నగర రక్షకుడూ, కొందరు భటులూ వచ్చినట్టుంది. నీ ఇంట నేను కనబడడం క్షేమమా లేక పెరటిద్వారం గుండా బయటికి వెళ్ళమన్నావా?'' అని అడిగాడు.

వృద్ధురాలు జవాబు చెప్పేలోపలే, నగర రక్షకుడు ద్వారాన్ని సమీపించి, తలుపు తడుతూ, ''లోపల వున్నవారెవరో వెంటనే తలుపు తెరవండి!'' అంటూ అధికారస్వరంతో కేకపెట్టాడు. — (ఇంకావుంది)



# దళనాయకుడు!

గండికోట రాజుకూ, పొరుగున వున్న మరొక శత్రురాజుకూ మధ్య యుద్ధం ప్రారంభమైంది. ఒక కొండదారికి అడ్డంగా పడివున్న ఒక పెద్దరాయిని అక్కడి నుంచి తొలగించేందుకు గండికోట సైనికులు నానాశ్రమా పడుతున్నారు. కొంచెందూరంలో నిలబడివున్న వాళ్ళ దళనాయకుడు వాళ్ళను కసురుకుంటూ, ''మందకట్టుకుని పదిమంది చవటలు వున్నారు! త్వరగా రాయిని పక్కకు నెట్టేయండి. రాజుగారి రథం ఏ క్షణంలో అయినా రావచ్చు!'' అంటూ గట్టిగా కేకలుపెడుతున్నాడు.

ఆ సమయంలో గుర్రం మీద అటుగా వచ్చిన ఒక వ్యక్తి, ఒక క్షణకాలం జరుగుతున్నదంతా చూసి, దళనాయకుడితో, ''నువ్వూ, ఆ పదిమంది సైనికులతోపాటు ప్రయత్నిస్తే, బండరాయిని సులువుగా పక్కకు నెట్టవచ్చునేమో, ఆలోచించావా?'' అన్నాడు.

''నేనా? నేను దళనాయకుణ్ణి!'' అన్నాడు దళనాయకుడు ధీమాగా.

ఆ జవాబు వింటూనే ఆ వ్యక్తిగుర్రం మీది నుంచి దిగి, సైనికుల దగ్గరకుపోయి, వాళ్ళను ఉత్సాహపరుస్తూ ''ఊ, నేను పదకొండోవాణ్ణి వచ్చాను! బలంగా పట్టండి ఒకపట్టు,'' అన్నాడు.

క్షణాలమీద బండరాయిని దారి పక్క నుంచి దూరంగా నెట్టేశారు. గుర్రం మీద వచ్చిన వ్యక్తి తృప్తిగా తలాడించి, తిరిగి గుర్రాన్నెక్కి, దళనాయకుడితో, ''మరొకసారి దారికడ్డంగావున్న బండరాళ్ళను తొలగించవలసిన అవసరం కలిగితే, మీ సేనాపతి వీరప్పనాయుడికి కబురుచెయ్యి!'' అంటూ గుర్రాన్ని అదిలించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఆ మాటలతో, ఆ వచ్చినవాడు గండికోట సేనాపతి అని దళనాయకుడికీ, సైనికులకూ అర్థమైంది.





బేతాళ కథలు

# తిట్లభూతం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు దేన్ని సాధించగోరి, భీతి గొలిపే ఈ శ్మశానంలో అర్ధరాత్రివేళ ఇంతగా శ్రమల పాలవుతున్నావో, ఇంకా నిగూఢంగానే ఉండిపోయింది. సాధారణంగా వ్యక్తులు తమ కోర్కెలను సఫలం చేసుకోవాలన్న ప్రయత్నంలో, బలమైన మానసిక వత్తిళ్ళకు గురై విసిగి వేసారి, చివరకు తాము సాధించదలచినదేమిటో కూడా మరిచిపో



తూండడం వింత ఏమీ కాదు. అరుణ అనే ఒక పెళ్ళీడు యువతి, ఒక మహర్షి ఇచ్చిన వరాన్ని అనాలోచితంగా తన మేలుకు కాక, ఇతరుల మేలుకోసం కోరింది. నువ్వూ అలాంటి పొర బాటు చేయకుండా వుండేందుకు ఆమెకథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

వీరమ్మ పరమగయ్యాళి. తలిదండ్రులు ఆమెను పరమ శాంతమూర్తి వీరయ్యకిచ్చి పెళ్ళిచేసి హమ్మయ్య అనుకున్నారు. ఆనాటి నుంచీ వీరయ్య ఇంట్లో అసలు శాంతి లేకుండా పోయింది.

వీరమ్మ కాపురానికి వచ్చేసరికి అత్తగారు మంచానపడివుంది. మామగారు తనపనులు తాను చేసుకోలేని ముసలివాడు. సరైన సేవలు అందక అత్తగారూ, మనశ్శాంతి లేక మామ గారూ ఎంతోకాలం బ్రతకలేదు. ఆ తర్వాత నుంచి వీరమ్మ, భర్తను సాధిస్తూ జీవితం కొన సాగించింది. ఆమెకొక కొడుకూ, కూతురూ పుట్టారు. వీరమ్మ వాళ్ళనూ సాధిస్తూండేది. కూతురు పెద్దదై పెళ్ళిచేసుకుని, అత్తవారి ఇంటికి వెళ్ళాక ఊపిరి పీల్చుకుంది.

భీముడు, వీరమ్మ కొడుకు. కండలు తిరిగి చూడ్డానికి మహావీరుడిలా వుంటాడు. కానీ వాడికి తండ్రి శాంతగుణం బాగా ఒంట బట్టింది. ఈ ప్రపంచంలో ఎవరికీ భయపడని భీముడు, తల్లికి మాత్రం భయపడేవాడు.

ఒకసారి భీముడు తల్లికోసం పట్టుచీర తేవాలని గంగవరం వెళ్ళాడు. గంగవరం పట్టుచీరలకు ప్రసిద్ధి. వీరమ్మకు అక్కడి నుంచి పట్టుచీర తెప్పించుకోవాలని చాలా కాలంగామనసు. కొడుక్కు రంగులు, చుక్కలు వివరాలన్నీ చెప్పిందామె. భీముడు గంగ వరంలో ఏ నేతగాడింటికి వెళ్ళినా, తల్లి చెప్పిన వివరాలకు సరిపోయే పట్టుచీర కనబడలేదు. అచ్చం తను చెప్పినలాంటి చీర తేకున్నా, అసలు చీరే తేకున్నా వీరమ్మ పెద్ద రాద్ధాంతం చేస్తుందని, భీముడికి తెలుసు. అందుకని, ఏం చేయాలో తోచక, ఆ ఊరి కాలవ ఒడ్డున చెట్టు కింద దిగులుగా కూర్చున్నాడు.

ఆ సమయంలో కొందరాడపిల్లలు అక్క డికి బిందెలతో వచ్చారు. రోజూ ఆ సమయంలో వాళ్ళు కాలవలో స్నానాలుచేసి, బిందెలతో నీళ్ళు తీసుకుని వెళతారు.

ఆడపిల్లల్లో అరుణ అనే అమ్మాయి, చెట్టు కింద కూర్చున్న భీముణ్ణి చూసి, ''ఎవరయ్యా, సిగ్గులేదూ, ఆడపిల్లలు స్నానం చేసే సమ యంలో ఇక్కడ కాపు కాశావు!'' అని చీవాట్లు పెట్టింది.

భీముడు దీనంగా ముఖంపెట్టి, తనకు వచ్చిన ఇబ్బంది అరుణకు చెప్పుకున్నాడు.

అది విన్న అరుణ హేళనగా నవ్వి, ''హే, గొప్ప తెలివైనదే, మీ అమ్మ! చీరల ఎంపికకు తను రావాలి; ఎవరైనా ఆడవాళ్ళను పంపాలి. మగవాణ్ణి-అందులోనూ నీలాంటివాణ్ణి పంపుతుందా! సరేలే, నీకు నేను సాయపడ తానుకానీ, నువ్వు ముందు ఇక్కణ్ణించి లేచి, ఊళ్ళోకి పో. అక్కడ సాంబయ్యగారిల్లెక్కడా అని అడిగి తెలుసుకుని, ఆ ఇంటి వీధి అరుగుమీద కూర్చో. నేను స్నానంచేసి వచ్చాక, మీ అమ్మ బాగుబాగు అని మెచ్చే చీర, నీ చేత కొనిపిస్తాను,'' అన్నది.

భీముడు అక్కడినుంచి లేచి తిన్నగా ఊళ్ళోకి పోయి, సాంబయ్య ఇల్లు తెలుసు కుని, ఆ ఇంటి అరుగు మీద కూర్చున్నాడు. కొంతసేపటికి అరుణ వచ్చి, వాణ్ణి పలకరించి, వీరమ్మ చూపులకెలా వుంటుందో అడిగి తెలుసుకున్నది. తర్వాత వాణ్ణి వెంటబెట్టు కుని, ఒక నేతగాడి ఇంటికివెళ్ళింది. అక్కడ ఒకచీర ఎంపికచేసి బేరమాడి తక్కువ ధరకు వచ్చేలా చేసింది.

ఇలా పని ముగిశాక అరుణ, భీముడితో, ''ఇల్లు చేరాక చీరను అమ్మకివ్వు. తర్వాత, ఆమెతో-నేతగాడు నువ్వు చెప్పిన చీర వివరా లన్నీ విని, అచ్చం అలాంటి చీరే ఆరేళ్ళక్రితం ఈదేశపు మహారాణికోసం నేసి ఇచ్చానన్నాడని చెప్పు. మహారాణి అభిరుచులతో సరిపోలిన అభిరుచులుగల మరొక స్త్రీ ఉన్నందుకు, అతడు ఆశ్చర్యపోయాడని కూడా చెప్పు. అయినా, అమ్మకు తృప్తి కలక్కపోతే-మహారాణి జాతకురాలికి, ఈచీర నచ్చి



తీరుతుందనీ, ఒకవేళ నచ్చకపోతే ఆవిడ మహారాణి జాతకురాలు అయుండదనీ అన్నాడు నేతగాడని చెప్పు. నీకే ఇబ్బందీ వుండదు,'' అంటూ భీముడికి హితబోధ కూడా చేసింది.

భీముడు తిరిగి తన ఊరు వెళ్ళి, అంతా అరుణ చెప్పినట్లే చేశాడు. తనను మహా రాణితో పోల్చినందుకు వీరమ్మ ఎంతో సంబ రపడి, భీముడు తెచ్చిన చీరను చాలా మెచ్చుకుంది.

వాడు, తండ్రితో జరిగిందంతా చెప్పి, ''అరుణ ఈ ఇంటి కోడలైతే, అమ్మలో మార్పు తేగలదని నాకు ఆశగా వుంది,'' అన్నాడు.

మర్నాడు వాడు పనిమీద పొరుగూరుకు వెళుతున్నానని తల్లికి అబద్ధం చెప్పి, గంగవరం వెళ్ళాడు. వాడు కాలవకేసి రావడం అంత దూరంలోనే చూసిన అరుణ, గబగబా వాడి



దగ్గరకు వచ్చి, ''మీ అమ్మ నిన్ను బాగా చీవాట్లు పెట్టిందా?'' అంది, భీముడి మీద జాలిపడుతూ.

''లేదు, చీరను బాగా మెచ్చుకుంది. నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడదామని వచ్చాను,'' అన్నాడు భీముడు.

దానికి అరుణ ఆశ్చర్యపోయి, ''ఏమిటా ముఖ్య విషయం?'' అని అడిగింది.

భీముడు కాస్త బెరుకుబెరుకుగా, ''నిన్ను పెళ్ళాడాలని వుంది,'' అన్నాడు.

''నువ్వు నన్నడుగుతావేమిటి? మీపెద్దలతో, మా పెద్దలను అడగమని చెప్పు,'' అన్నది చిరాగ్గా అరుణ.

''పెద్దల సంగతి తర్వాత. నాకు నువ్వు నచ్చావు. నేను నీకు నచ్చానో లేదో తెలుసుకుందామనే, ఇప్పుడిలా వచ్చాను,'' అన్నాడు భీముడు.

అరుణ ఒక క్షణం భీముడి ముఖంకేసి చూసి, ''నువ్వు అందంగా వున్నావు. మంచివాడివి. నచ్చావుకాబట్టే చీర ఎంపికలో నీకు సాయపడ్డాను,'' అంటూ సిగ్గుపడింది.

అప్పుడు భీముడు, అరుణకు తన తల్లిని గురించి వివరంగా చెప్పి, ''నీ తెలివి తేటలతో, మా అమ్మను మార్చగలవా? బాగా ఆలోచించుకో!'' అన్నాడు.

ఆలోచించడానికి అరుణకు ఎంతోసేపు పట్టలేదు. ఆమెకు బిల్వమహర్షి గుర్తుకు వచ్చాడు. ఆయన ఒకసారి దేశసంచారం చేస్తూ, గంగవరం వచ్చి, కాలువ ఒడ్డున జారిపడ్డాడు. కాలు మడతపడడంతో ఆయన లేవలేక అవస్థపడుతూంటే, స్నానానికి వచ్చిన ఆడపిల్లలు, ఆయన్ను అపహాస్యం చేయడమే కాక, తొందరగా అక్కణ్ణించి వెళ్ళిపొమ్మని కేకలు వేశారు.

అరుణ వాళ్ళను మందలించి, బిల్వమహర్షికి తగిన శుశ్రూషచేసి లేవదీసి కూర్చోబెట్టింది. అప్పుడాయన అరుణతో, ''అమ్మాయీ, నీ సేవలకు సంతోషించాను. ఏదైనా వరం కోరుకో, ఇస్తాను!'' అన్నాడు.

అయితే, ఏం కోరుకోవాలో అప్పటికి అరుణకు తెలియలేదు. ఆమె కొంత గడువు కోరింది. బిల్వమహర్షి సరేనని, ''కళ్ళు మూసుకుని మూడుమార్లు నాపేరు తలచుకుంటే ప్రత్యక్షమై, నీ కోరిక తీరుస్తాను,'' అని వెళ్ళిపోయాడు.

అరుణ ఇప్పుడు భీముడికి, బిల్వమహర్షి కథచెప్పి, ''మీ అమ్మను మార్చడం మామూలు మనుషులవల్ల అయ్యే పనిలా కనిపించడం లేదు. మనం బిల్వమహర్షిసాయంఅర్థిద్దాం!''

అంటూ, ముమ్మారు ఆయన పేరు తలుచుకున్నది.

బిల్వమహర్షి తక్షణమే ప్రత్యక్షమయ్యాడు. అరుణ కోరికతెలుసుకుని, భీముడితో, ''పద నాయనా, మనం వెళ్ళి మీ అమ్మను కలుసుకుందాం,'' అన్నాడు.

మహర్షి భీముడితో వాళ్ళ ఊరుచేరి, భీముడి ఇంట్లో ప్రవేశించి, మంచంమీద పడుకుని ఏదో ఆలోచిస్తున్న వీరమ్మను పలకరించి, ''అమ్మా, నాకు భిక్ష కావాలి!'' అన్నాడు.

వీరమ్మ ఉలిక్కిపడి లేచి కూర్చుని, ''బిచ్చం కోసం వచ్చావు. మరి బిచ్చమడిగేపద్ధతి ఇదేనా?'' అంటూ మహర్షిని తిట్టడం మొదలుపెట్టింది.

''అమ్మా! ఇష్టముంటే బిచ్చం వెయ్యి; లేకుంటే పొమ్మని చెప్పు. నీ తిట్లు భూతమై నిన్నే బాధిస్తాయి,'' అన్నాడు బిల్వమహర్షి.

''తిట్టడం నాకు అలవాటు. అమ్మానాన్నలను తిట్టాను. నాకేమీ కాలేదు. అత్తమామలను తిట్టాను, వాళ్ళే పోయారు. మొగుణ్ణీ, కొడుకునూ తిడుతున్నాను. చచ్చినట్టు పడుతున్నారు. నాకు మాత్రం ఎన్నడూ ఏమీ కాలేదు!'' అన్నది వీరమ్మ నిరసనగా.

''నావల్ల తప్పైందనుకో, నువ్వు నన్ను తిడితే, ఆ తిట్టు నాకు శాపమవుతుంది. అకారణంగా నన్ను తిట్టావనుకో, అప్పుడా తిట్టు నీ దగ్గరే వుండి నీకు శాపమవుతుంది. ఈ విషయం నీకు అర్థంకావడం కోసం, ఈ క్షణంలోనే--అకారణంగా ఇతరులను నువ్వు తిట్టిన తిట్లన్నీ భూతం రూపం ధరించాలని ఆజ్ఞాపిస్తున్నాను,'' అన్నాడు బిల్వమహర్షి.

అంతే! ఆ క్షణంలోనే వీరమ్మ ముందు భయంకరాకారంలో ఒక భూతం నిలబడి,



''అహో, వీరమ్మా! నేను నీ తిట్లభూతాన్ని! ఇంకొక నాలుగేళ్ళతర్వాత, నిన్ను తీరని వ్యాధి రూపంలో బాధించాలనుకున్నాను. కానీ ఈ మహర్షి కారణంగా చాలా ముందుగానే, భూత రూపం వచ్చేసింది. నావల్ల మరేదైనా నాశనం కావాలంటే చెప్పు. లేకుంటే నేను ఇప్పుడే నిన్ను నాశనం చేస్తాను,'' అన్నది.

వీరమ్మ హడలిపోయింది. ఆమెకు వేరే దిక్కు తోచక, మహర్షి కాళ్ళమీద పడింది. ఆయన ఆమెను లేవనెత్తి, ''భూతం నీకు ప్రియమైనదాన్ని మాత్రమే నాశనం చేస్తుంది. మీ ఇంటి పెరట్లో నీకెంతో ప్రియమైన అంటు మామిడి చెట్టుందికదా! దాన్ని నాశనం చెయ్యమనిచెప్పు. భూతం ప్రస్తుతానికి నిన్ను విడిచి పెడుతుంది,'' అన్నాడు. వీరమ్మ సరేననగానే భూతం మాయమైంది. పెరట్లోకి వెళ్ళి చూస్తే, అక్కడ మామిడి చెట్టు లేదు.

అప్పుడు బిల్వమహర్షి ఎంతో శాంతంగా, ''వీరమ్మా! నువ్వికనుంచి ఎవరినీ అకారణంగా తిట్టకు. అలా తిట్టినప్పుడల్లా భూతం నీ ముందు ప్రత్యక్షమవుతుంది. ఇకముందు మంచిగా వుంటే, నిన్నేభూతమూ బాధించదు. ఒక ముఖ్యమైన సంగతి! నీ కొడుక్కు, గంగవరంలో వుండే అరుణ అనే అమ్మాయితో పెళ్ళి చేయి. ఆమె చాలా మంచిది, తెలివైనది. నువ్వు నీ కోడల్ని ప్రేమగా చూసుకుంటే, క్రమంగా నీ తిట్లభూతం శక్తి నశించి మాయమవుతుంది. బాగా గుర్తుంచుకో. నీ కష్టసుఖాలిక నీలోనే వున్నాయి,'' అని చెప్పి, బిల్వమహర్షి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

తర్వాత కొద్దిరోజుల్లోనే భీముడికీ, అరుణకూ పెళ్ళయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, బిల్వమహర్షి ఇచ్చిన వరాన్ని, అరుణ తగుపాటి వివేకంతో ఉపయోగించుకున్నట్టు కనబడదు. ఆ వర ప్రభావంతో ఆమె, ఏ గొప్ప ధనవంతుడి ఇంటికోడలో అయి సర్వసుఖాలూ అనుభవించవచ్చు. ఆమె వరాన్ని, తన కోసం, తన వాళ్ళకోసం కాక భీముడి మేలుకోసం ఉపయోగించడం అనుచితం, అనాలోచితం కాదా? ఈసందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తలపగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఏ తలిదండ్రులైనా తమ కుమార్తెకు పెళ్ళికావాలి, పెళ్ళయ్యాక సుఖపడాలి అనేగదా కోరుకునేది! ఆ విధంగా అరుణ తన వరాన్ని తలిదండ్రుల ఆనందం కోసమే ఉపయోగించుకున్నట్టు కనబడుతున్నది. ఇక ఆమె స్వవిషయానికొస్తే-సాధారణంగా మగవాళ్ళకు చిరాకెక్కువ. అలాంటప్పుడు, ఎన్నిమాటలన్నా నోరెత్తకుండా వుండే భీముడిలాంటివాణ్ణి ఏ ఆడపిల్లయినా కోరుకుంటుంది. అట్లని, తిట్లభూతం శక్తి చూసిన అరుణ, భీముడిపట్ల గయ్యాళిలా ప్రవర్తించే అవకాశం ఏమాత్రం లేదు. ఈ కారణాలవల్ల అరుణ, మహర్షి ఇచ్చిన వరాన్ని తనకూ, తన వాళ్ళకూ శుభంకలిగే విధంగానే ఉపయోగించుకున్నది. అందువల్ల, అరుణ నిర్ణయంలో అనుచితం, అనాలోచితం అంటూ ఏమీ లేదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగంకలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ''వసుంధర'' రచన]



# మనదేశం గురించి తెలుసుకుందాం

## క్విజ్

ప్రకృతిసిద్ధంగా కొన్ని ప్రదేశాలు ప్రత్యేకతను సంతరించుకుని ప్రసిద్ధమయితే, మరికొన్ని ప్రాంతాలు అక్కడి మహనీయుల కారణంగా; సాంస్కృతిక,మత, రాజకీయ సంఘటనల ద్వారా ప్రసిద్ధి పొందుతాయి. కొన్ని ప్రాంతాలకు సంబంధించిన విశేషాలు ఇక్కడ ఇవ్వబడ్డాయి. వాటిని గురించి మీకు ఎంతవరకు తెలుసో ఆలోచించి చూడండి:

1. జపానుదేశాన్ని 'సూర్యుడు ఉదయించే భూమి' అని అంటారు. మరి మనదేశంలో ఏ ప్రదేశాన్ని ఉదయభానుడి కిరణాలు మొట్టమొదట స్పృశిస్తాయో తెలుసా?
2. ఆదిమతెగల జనాభా అత్యధిక శాతం ఉన్న రాష్ట్రం ఏది?
3. ఒక రాష్ట్రానికి చెందిన విలక్షణ నాట్యశైలిని విశ్వకవి రవీంద్రనాథ టాగూర్ బయటి ప్రపంచానికి పరిచయంచేసి ప్రాచుర్యం కలిగించాడు. ఆ రాష్ట్రం ఏది?
4. ఒక రాష్ట్రానికి ఆ పేరు రావడానికి కారణం అక్కడ అధిక సంఖ్యలో ఉన్న బౌద్ధ ఆరామాలే (మఠాలు) కారణం. ఆ రాష్ట్రం ఏది?
5. మనదేశాన్ని బ్రిటిష్‌వాళ్ళు ఢిల్లీనుంచి పరిపాలించినప్పుడు, వేసవికాలంలో వేరొక రాజధాని ఉండేది. ఆ ప్రత్యేకతను సంతరించుకున్న నగరం ఏది? అది ఏ రాష్ట్రంలో ఉన్నది?
6. ప్రపంచంలోనే ప్రప్రథమ ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నుకోబడిన కమ్యూనిస్టు ప్రభుత్వం కలిగిన రాష్ట్రం ఏది?
7. ఫ్రెంచి శిల్ప(వాస్తు) శాస్త్రవేత్త లేకోర్బూసియర్ ఒక నమూనా నగరానికి రూపకల్పన చేశాడు. అది ఇప్పుడు రెండు రాష్ట్రాలకు రాజధానిగా ఉన్నది. ఆ నగరం పేరేమిటి? రెండు రాష్ట్రాలు ఏవి?
8. కుంభమేళా నాలుగు వేర్వేరు ప్రాంతాలలో జరుగుతున్నది. వాటిలో రెండు ప్రాంతాలు ఒకే రాష్ట్రంలో ఉన్నవి. ఏ రాష్ట్రంలో?

(సమాధానాలు వచ్చే సంచికలో)

## జనవరి క్విజ్ సమాధానాలు

1. 'నేతాజీ' సుభాష్‌చంద్ర బోస్.
2. మంగన్‌లాల్ గాంధీ 'మంచిపనుల పట్ల ఆసక్తి' అనే భావంతో 'సదాగ్రహ' అనే పదాన్ని రూపొందించాడు. గాంధీజీ దానినే 'సత్యాగ్రహం'గా మార్చుకున్నాడు.
3. 1916 లక్నో కాంగ్రెస్ మహాసభలో.
4. లాలా లజపత్‌రాయ్, బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్.
5. 1905.
6. 1857.
7. 1929 డిసెంబర్ 31 వ తేదీ జరిగిన లాహోర్ కాంగ్రెస్ మహాసభలో.
8. 1928 లో సర్ జాన్ సైమన్ నాయకత్వంలో, భారతీయ నాయకులతో పరిపాలనా సంస్కరణలను గురించి చర్చించడానికి.
9. 1946 ఆగస్ట్ 24.
10. బాలగంగాధర తిలక్.

## నాగాలాండ్ జానపద కథ

కొండలతో నిండిన నాగాల్యాండ్ రాష్ట్రం మనదేశ ఈశాన్య దిశలో ఉంది. ఉత్తరంగా అరుణాచల్‌ప్రదేశ్, అస్సాం రాష్ట్రాలు; దక్షిణంగా మణిపూర్; పశ్చిమంగా అస్సాం; తూర్పున మియాన్మార్ (బర్మా)లనుసరిహద్దులుగా కలిగి ఉంది.

16,527 చ.కి.మీ.వైశాల్యంగల ఈ రాష్ట్ర జనాభా (2001 జనాభా లెక్కల ప్రకారం) 19,88,636. ఈ రాష్ట్రం సముద్రమట్టానికి దాదాపు 1,490 మీ. ఎత్తులో ఉంది.

కోహిమా రాజధానిగా 1963 డిసెంబర్ 1వ తేదీ నాగాల్యాండ్ రాష్ట్రం ఏర్పాటయింది. మన భారత యూనియన్‌లో ఇది 16 వ రాష్ట్రం. ఇక్కడి ప్రజలు ప్రధానంగా హిందీ, నాగమీస్, ఇంగ్లీషు భాషలు మాట్లాడుతున్నారు.

నాగా పర్వతసానువులలో చాలా ఎత్తయిన సారామతి కొండ శిఖరం సముద్రమట్టానికి 3.877 మీ. ఎత్తులో ఉంది. ప్రకృతి సౌందర్యానికి పేరుగాంచిన కోహిమా వేసవి విడిది.

సముద్రమట్టానికి 195 మీ. ఎత్తులో ఉన్న దిమాపూర్‌ను ఈ రాష్ట్రానికి సింహద్వారంగా చెబుతారు.

# కోహితో - కిన్నెర

నాగాల్యాండ్‌లోని జున్హే బోటో అనే చిన్న గ్రామంలో కోహితో నివసిస్తూండేవాడు. కోహితోకు పర్థాలు గేట్చు. వాడు నా అనేవాళ్ళులేని అనాథ. ఎవరిగొడవల్లో వాళ్ళు సతమతమవుతూ ఉండేవారు తప్ప గ్రామస్థులెవరూ కోహితోను పట్టించుకునేవారు కాదు. వాడు 'మోరుంగ్'లో పొరుగూరు కుర్రవాళ్ళతో కలిసి తిరిగేవాడు. కోహితో కిందామీదా పడి, ఆ పనీ ఈ పనీచేసి పొట్ట నింపుకునేవాడు. కాని, కానీ మిగల్చ లేకపోయాడు వాడు, 'దావో' తయారుచేయడం, వెదురుబుట్టలు అల్లడం, అడవిలో జంతువులను వేటాడడం నేర్చుకోవాలనుకున్నాడుగాని, వాటిని నేర్పే నాథుడు లేకపోయాడు.

గ్రామంలో బుట్టలల్లేవాడి దగ్గరికి వెళ్ళి నేర్పమంటే, 'వెళ్ళువెళ్ళు, మా పని చెడగొట్టకు, పిల్ల



వెధవా!'' అని కసురుకునేవాడు. కోహితో, పట్టరాని దిగులుతో వెనుదిరిగేవాడు. ఏం చేయడానికీ తోచక సతమతమయ్యేవాడు.

ఒకనాడు ఒక యువకుడు తన ఈటెకు పదును పెడుతూ ఉండడం, కోహితో చూశాడు. వాడి దగ్గరికి వెళ్ళి కోహితో, ''ఈటె తయారుచేయడం నాకు నేర్పుతావా?'' అని అడిగాడు.

''ఇప్పుడు కాదు, తరవాత చెబుతాను. నీలాగా నేను తీరిగ్గా తిని కూర్చోలేదు,'' అని విసురుగా వెళ్ళిపోయాడాయువకుడు.

కోహితోకు ఆ మాటతో పట్టరాని కోపం వచ్చింది. ఊరి చివరికి వెళ్ళి అక్కడ గుంపుగా పడిఉన్న పెదుళ్ళకు ఆనుకుని తీవ్రంగా ఆలోచించసాగాడు. 'నేను పనీపాటూ లేకుండా ఎవరికీ, ఎలాంటి ప్రయోజనమూ లేకుండా తిరుగుతున్నానా?'' అంటూ బాధగా నిట్టూర్చి, ఆ తరవాత కొంతసేపటికి పిడికిలి బిగించి, ''పదిమందీ గౌరవించేలాగా ఏదైనా ఒక పనిచేయాలి. ఇంతకు ముందు ఈ గ్రామంలోని వాళ్ళెవ్వరూ చేయని గొప్పకార్యాన్ని చేయాలి!'' అనుకున్నాడు. ఆ ఆలోచనే వాడిలో నూతన ఉత్తేజాన్ని కలిగించింది. ఏ పనిచేస్తే సాటి గ్రామప్రజలు గౌరవించగలరా అని తీవ్రంగా ఆలోచిస్తూ ముందుకు నడవసాగాడు.

అప్పుడు వాడికి ఒక పాట వినిపించింది. ఆ గ్రామానికి చెందిన కొందరు ఆడపిల్లలు దూరంలో వెళుతున్నారు. ప్రతి ఒక్కరూ 'ఖాంగ్' కడవను చంకన పెట్టుకుని కొండదిగువున ప్రవహిస్తూన్న నదిలో నుంచి నీళ్ళు తేవడానికి బయలుదేరారు. నదిని చేరుకోవాలంటే చాలాదూరం కాలినడకనే వెళ్ళాలి. నడకవల్ల అలసట తెలియకుండా ఆడపిల్లలు పాడుకుంటూ వెళుతున్నారు. వాళ్ళను చూడగానే కోహితో మనసులో ఒక ఆలోచన మెరుపులా మెరిసింది.

ఆ గ్రామంలో ప్రతి ఒక్కరూ ఎదుర్కొంటూన్న అతిపెద్దసమస్య నీళ్ళఎద్దడి. తాను ఒక బావి తవ్వకలిగితే గ్రామస్థులు నీళ్ళకోసం పడే కడగండ్లనుంచి గట్టెక్కుతారు. వాళ్ళు ప్రస్తుతం పడుతూన్న కష్టాలు తీరుస్తాను గనక, ఆ తరవాత తననెవ్వరూ తేలిగ్గా



తీసిపారెయ్యరు. అందరూ గౌరవిస్తారు. ఈ ప్రాంతంలో బావి తవ్వడానికి ఇప్పుడే ప్రారంభించాలి. అయితే పని పూర్తయ్యేంతవరకు ఆ సంగతి వేరెవ్వరికీ చెప్పకూడదు. చెబితే తను చేస్తూన్నపని అసాధ్యమని అపహాస్యం చేయవచ్చు!

పారా, పలుగూ పట్టుకుని అప్పుడే బావి తవ్వడానికి పూనుకున్నాడు. అది పసివాడినైన తనవల్ల అంత సులభంగా సాధ్యమయ్యే పనికాదని వాడికీ తెలుసు. అయితే, ఎలాగైనా తవ్వి తీరాలన్న పట్టుదలతో తవ్వడం ప్రారంభించాడు. పొట్ట నింపుకోవడానికి ఇతర పనులు చేసుకుంటూ, తీరిక దొరికినప్పుడల్లా బావి తవ్వడం కొనసాగించాడు.

ఆ విధంగా రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడిచిపోయాయి. వాడు బావి తవ్వడం మాత్రం మానలేదు. దిగువ నీళ్ళను సమీపించేసరికి కోహితో యుక్తవయస్కుడయ్యాడు. ఒకనాడు అతడు ఎప్పటిలాగే గునపాన్ని ఎత్తి బలంగా నేలలో దించాడు. దాంతో పాతాళగంగ వాడి ముఖం మీదికి నీటి బుగ్గలా పైకి చిమ్మింది. కోహితో ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు! క్షణాలలో బావి నీళ్ళతో నిండిపోయింది!

## తలల వేట!

ఒకానొకప్పుడు నాగాలు మనుషులను వేటాడే వాళ్ళు. కనీసం ఒక్క మనిషి తలను కూడా వేటాడ లేనివాణ్ణి అసమర్థుడని పరిహసించే వాళ్ళు. అలాంటి వాడికి సులభంగా పిల్లనిచ్చేవాళ్ళు కూడా కాదు. ప్రాచీన నాగాలు పుర్రెలను ఇళ్ళల్లో జ్ఞాపికల్లా అమర్చి ఉంచేవారు. అది వాళ్ళ వీరానికి చిహ్నంగా భావించేవాళ్ళు!





కోహితో సంతోషంగా గట్టుమీదికి వచ్చాడు. దూరంగా కొందరు ఆడపిల్లలు పాడుకుంటూ నీళ్ళకోసం నదికేసి నడవడం గమనించాడు. వాడు గబాగబా పరిగెత్తి వాళ్ళదగ్గరికి వెళ్ళి, "నీళ్ళ కోసం మీరు ఇకమీదట అంతదూరం వెళ్ళ పని లేదు. నేను బావి తవ్వాను. నీళ్ళు మహాస్వచ్ఛంగా ఉన్నాయి, వచ్చిచూడండి!" అన్నాడు. వాడి మాటలు వాళ్ళు మొదట నమ్మలేదు. అయినా, వెళ్ళి చూడ్డం వల్ల నష్టమేమిటి అన్న ఉత్సాహంకొద్దీ వాడి వెనక వెళ్ళారు. నిర్మలజలంతో నిండిన బావిని చూసి పట్టరాని ఆనందం చెందారు.

క్షణాలలో కోహితో బావి గురించి ఊరు ఊరంతా తెలిసిపోయింది. పిల్లలూ, పెద్దలూ, ఆడా,మగా అందరూ వచ్చి ఆ బావిని వింతగా చూడసాగారు. దానిని ఒంటరిగా తవ్విన కోహితో పట్టుదలనూ, శక్తిసామర్థ్యాలనూ మెచ్చుకున్నారు. ఇప్పుడు కోహితో నలుగురి మెప్పునూ పొంది గ్రామప్రముఖు లలో ఒకడుగా గుర్తింపు పొందాడు.

అయితే, ఇది అట్టేకాలం కొనసాగలేదు. కొన్నా ళ్ళకు కోహితో బావిని గురించి మేఘాల మధ్య ఉన్న కిన్నెరలకూ తెలియవచ్చింది. కిన్నెర యువతులు రాత్రుల్లో చంద్రోదయమయ్యాక భూమి మీదికి దిగివచ్చి కోహితో బావిలో జలక్రీడలాడి సూర్యో దయానికి ముందు తమ లోకానికి వెళ్ళిపోయేవారు. అలా వాళ్ళు జలకాలాడివెళ్ళడంవల్ల బావిలో వాళ్ళ

రెక్కల నుంచి రాలిన ఈకలు, తల పువ్వుల రేకుల వల్ల నిర్మలజలం కలుషితం కాసాగింది.

దానిని చూడగానే గ్రామస్థులకు ఆగ్రహం కలిగింది. కోహితోను పిలిపించి, "ఈ బావిని ఇలా కలుషితం చేస్తున్నవారెవరు?" అని నిలదీశారు. "నాకు తెలియదు!" అన్నాడు కోహితో. అయినా గ్రామస్థులు వాడి మాటను నమ్మలేదు. "నువ్వు నీ బావిని ఉపయోగించుకోవడానికి మరెవరినో అనుమతిస్తున్నావు! అందువల్లే అంత త్వరలోనే బావి నీళ్ళు పాడయ్యాయి. ఇది ఇలాగే కొనసాగిందంటే నిన్ను గ్రామంనుంచి తరిమివేయక తప్పదు!" అని హెచ్చరించారు.

ఈ విషయంలో ఏదైనా చేసితీరాలనే నిర్ణయానికి వచ్చాడు కోహితో. ఎందుకంటే సంవత్సరాల తరబడి ఎంతో శ్రమపడిన తరవాతే పదిమందిలో గౌరవం సంపాదించుకోగలిగాడు. దానిని అంతలోనే పోగొట్టుకోవడానికి వాడికి మనసొప్పలేదు.

ఒకనాటి అర్ధరాత్రి సమయంలో వాడు బావి దగ్గరికి వెళ్ళి ఒక వెదురుపొద చాటున కూర్చున్నాడు. చంద్రోదయ సమయంలో యథాప్రకారం అక్కడికి వచ్చిన కిన్నెరలు, నీళ్ళలో దిగడానికి ముందు తమ వీపులకు ఉన్న రెక్కలను విప్పి ఒక బండమీద ఉంచారు. "ఆహా! ఈ పని చేస్తున్నది మీరా? నాకున్న మంచిపేరును కాస్తా చెడగొడుతున్న మీకు సరైన గుణపాఠం నేర్పుతాను!" అనుకుంటూ కోహితో అడుగుమీద అడుగువేసుకుంటూ ఆ రెక్కలున్నచోటికి వెళ్ళి, ఒక జత రెక్కలను తీసుకుని ఇంటికి పారిపోయాడు.

తూర్పుదిశలో అరుణరేఖలు విచ్చుకుంటూండగా కిన్నెరలు బావిలోనుంచి పైకి వచ్చారు. రెక్కలను తీసి వీపులకు తగిలించుకుని తమ లోకానికి ఎగిరి వెళ్ళిపోయారు. ఒక్క కిన్నెరమాత్రం అక్కడే ఉండిపోయింది. "ఆగండి... నేనూ వస్తున్నా.. నారెక్కలెక్కడో కనిపించడంలేదు... వెళ్ళిపోకండి!" అని వాళ్ళతో ఏకరువుపెట్టింది. అయినా ఒక్కరూ వినిపించుకోకుండా వెళ్ళిపోయారు. ఆఖరికి ఆ ఒక్క కిన్నెరమాత్రంఏడుస్తూ అక్కడే ఉండిపోయింది!

"నిన్ను ఇక్కడి నుంచి వెళ్ళనివ్వను. ఇది నీ స్నేహితురాండ్రకు గుణపాఠంగా ఉండాలి! ఇకపై ఒక్కరూ నా బావి దరిదాపులకు రాకూడదు!" అంటూ అక్కడికి వచ్చాడు కోహితో.

కిన్నెర కన్నీరు మున్నీరుగా విలపించింది. దానిని చూసి కోహితో మనసు కాస్త మెత్తబడింది. పైగా ఆమె చాలా అందంగా ఉంది. "నీకు ఏ కొరతా రాకుండా కాపాడతాను. నన్ను పెళ్ళిచేసుకుంటావా?" అని అడిగాడు కోహితో. కిన్నెర మరొక మార్గంలేక అందుకు ఒప్పుకున్నది.

## ఆటవిక తెగలు

నాగాల్యాండ్‌లో వివిధరకాల తెగల ప్రజలు నివసిస్తున్నారు. ముఖ్యంగా పధ్నాలుగు తెగలను గుర్తించారు. వాటిలో అంగామి, ఆవో, ఛఖేసాంగ్, చాంగ్, ఖేముంగాన్, కోన్యాక్, లోథా, ఫోమ్ తెగలు ప్రధానమైనవి. ప్రతి తెగకూ ప్రత్యేక సంప్రదాయాలూ, ఆచారాలూ ఉన్నాయి. మాట్లాడే భాషలోనూ మాండలికాలు ఉన్నాయి. కట్టుకునేదుస్తులు, పెట్టుకునేనగలు, ధరించేతలపాగాలు కూడా ఒక్కొక్క తెగకు ఒక్కొక్క విధంగా ఉంటాయి. ఈ ప్రధానమైన తెగలు ప్రస్తుతం మరిన్ని ఉపతెగలుగా విభజించబడి ఉన్నాయి.





వండడం; జూతో, రుహీ బియ్యం బీరు తయారు చేయడం, బుట్టలల్లడం, నాగా గీతాలు పాడడం నేర్చుకున్నది. రోజులు సుఖంగానే గడిచిపోతున్నాయి కాని, ఆమెకు మేఘాల మధ్య ఉన్న తమ స్వస్థలానికి వెళ్ళాలనే కోరిక మాత్రం రోజురోజుకూ ఎక్కువవుతూనే వచ్చింది. ఇలా కొన్ని సంవత్సరాలు దొర్లిపోయాయి.

కోహితో ఇంటిపట్టున లేనప్పుడల్లా ఆమె తన రెక్కల కోసం ఇల్లంతా వెతికేది. అయితే, కోహితో వాటిని కిన్నెర కంట బడనిచోట జాగ్రత్తగా దాచాడు. కిన్నెర ఒకనాడు వాటిని ఎక్కడ దాచి ఉంటాడా అని తీవ్రంగా ఆలోచించసాగింది. తాను చూడని చోటు, తాను వెళ్ళలేని చోటు ఏదైఉంటుందో అక్కడే దాచి ఉంటాడు. అది ఏదై ఉంటుంది? అని ఆలోచించింది. చటుక్కున ఆమెకొక ఊహతట్టింది. కోళ్ళ గూటిలో దాచి ఉంటాడా? వెంటనే ఆమె లేచి ఇంటి వెనక ఉన్న పాకలోకి వెళ్ళింది. అక్కడ భరించలేని దుర్గంధం.

అమెను అప్పుడే పెళ్ళాడి తన వెంట గ్రామానికి తీసుకువెళ్ళాడు. ఇద్దరూ కలిసి సొంతంగా ఇల్లు కట్టుకున్నారు. కిన్నెర మాంసం కూర, అన్నం

అయినా, ఆమె పట్టుదలతో కోళ్ళ గూటిలో చేయి పెట్టి చూసింది. కోడి పిల్లలు అరవడంతో తల్లికోడి ఆమె అందమైన చేతిని గోళ్ళతో, ముక్కుతో రక్కింది.

## హస్తకళలు



సంప్రదాయబద్ధమైన నాగా శిల్పకళలు, వస్త్ర చిత్రాలు చాలావరకు తలల వేటను ప్రధాన అంశంగా కలిగి ఉన్నాయి.

కొయ్యబొమ్మలు చేయడం, కొయ్యల మీద బొమ్మలు చిత్రించడం, వెదురుతో రకరకాల వస్తువులు తయారు చేయడం; కుండలు చేయడం మొదలైన వాటిలో నాగాలు సిద్ధహస్తులు. నాగాల్యాండ్ అడవుల్లో నాణ్యమైన వెదుళ్ళు, పేములు విరివిగా లభిస్తాయి. అందమైన వెదురుబుట్టలు అల్లడంలో నాగాలు నిపుణులు. కంఠాభరణాలు, చేతి కడియాలు, కాలి కడియాలు మొదలైన వాటిని పేములతో తయారుచేస్తారు.

అయినా ఆమె చేతిని వెనక్కు తీయకుండా అక్కడ ఏముందోనని వెతకసాగింది. ఆమె వేళ్ళకు ఏదో మెత్తగా తగిలింది. ఆమె దానిని మెల్లగా వెలుపలికి తీసింది. "ఆహా! తన రెక్కలు! కాకపోతే కొంచెం కంపుకొడుతూ, ముర్గ్గా, అంచులు మడతలుబడి ఉన్నాయి. అయినా అవి పనికివస్తాయి!" అనుకుంటూ ఆమె వాటిని విదిలించి, తన వీపుకు కట్టుకున్నది. ఒక్క ఊపున పైకి ఎగిరి, తిరిగి చూడకుండా మేఘాలమధ్య ఉన్న తన లోకాన్ని చేరుకున్నది.

పొద్దుపోయాక కోహితో ఇంటికి తిరిగి వచ్చాడు. భార్య జాడ కనిపించలేదు. ఇల్లంతా, పెరట్లో వెతికాడు. ఇరుగు పొరుగును అడిగాడు. ఆ తరవాత పిచ్చివాడిలా తిరుగుతూ కనబడ్డవారినందరినీ తన భార్య గురించి అడగసాగాడు. అయితే, ఒక్కరు కూడా చూసినట్టు చెప్పలేదు. ఆత్రంగా కోళ్ళ గూటి దగ్గరికి వెళ్ళి కోళ్ళ గూట్లో చేయిపెట్టి రెక్కల కోసం వెతికాడు. అవి కనిపించలేదు. అప్పుడర్థమయింది వాడికి అసలు విషయం. భార్య వెళ్ళిపోయిన బాధను భరించలేకపోయాడు.

వాడు తన గుడిసె ముందు కూర్చుని భోరుమని ఏడ్వసాగాడు. ఉన్నట్టుండి ఒక తెల్లకాకి వాడి పక్కన వాలి, "ఏడవకు కోహితో. ఆమె ఆకాశంలోకి ఎగిరిపోవడం నేను చూశాను. కావాలంటే నిన్ను కూడా అక్కడికి తీసుకువెళ్ళగలను. అయితే, నువ్వు అందుకు నాకొక ప్రత్యుపకారం చెయ్యాలి!" అన్నది.

"అలాగే, మిత్రమా! ఏం చెయ్యాలో చెప్పు," అన్నాడు కోహితో ఆతృతగా.

"నన్ను నల్లకాకిగా మార్చాలి. తెల్లగా ఉండడం నాకు నచ్చలేదు. నేను వింతగా కనిపించడంవల్ల నా అన్నదమ్ములందరూ నన్ను వదిలి వెళ్ళిపోయారు," అన్నది తెల్లకాకి.

"కిన్నెరరాజ్యం చేరుకోగానే తప్పక చేస్తాను," అని మాట ఇచ్చాడు కోహితో.

ఆ తరవాత వాడు తెల్ల కాకి వీపుమీద కూర్చున్నాడు. అది ఆకాశం కేసి ఎగిరింది. చాలాదూరం పయనం చేసి వాళ్ళు మేఘాల మధ్య ఉన్న కిన్నెర లోకం చేరుకున్నారు. అక్కడున్న కిన్నెరలు వారిని

## పారిభాషిక పదాలు

మోరుంగ్ : బ్రహ్మచారుల విడిది.
దావో : ఒక రకం ఈటె.
ఖాంగ్ : భుజానికి తగిలించుకునే వెదురుబుట్ట.
చుంగా : వెదురు లోటాలు.
కిన్నెరలు : మేఘాలలో నివసించే ఒక రకం దేవతాస్త్రీలు.
జూతో, రుహీ: బియ్యంతో తయారు చేసే బీరు.



కోహితో భార్య ఉన్నచోటికి తీసుకువెళ్ళారు. ఆమె కోహితోకు సాదరంగా స్వాగతం పలికింది. తాను చెప్పాపెట్టకుండా పారిపోయి వచ్చినందుకు ఆమెలోలోపల బాధపడింది. తనచర్యకు సిగ్గుపడింది. తనకేసి ప్రేమతో చూస్తున్న భర్తతో, "దయచేసి మళ్ళీ నన్ను భూలోకానికి రమ్మని పిలవవద్దు, శాంతి సుఖాలతో ఇక్కడే హాయిగా ఉందాం!" అన్నది చిన్నగా నవ్వుతూ. కోహితో అందుకు సంతోషంగా అంగీకరించాడు.

# హాస్యచతురులు: తెనాలి రామలింగడు



శ్రీకృష్ణదేవరాయలు సభలో కొలువుతీరి ఉన్నాడు. ఇద్దరు భటులు ఒక పెద్ద చిత్రపటాన్ని చెరియొక పక్కన పట్టుకుని రాజుగారికీ సభికులకూ చూపారు. అది సకల రాజలాంఛనలతో నిండిన కృష్ణదేవరాయల చిత్రపటం. దానిని చూసి రాజు ఎంతో సంతోషించాడు.



సభికులు దానిని చూసి, 'ఆహా!' 'ఓహో' అనడం రాజుగారికి వినిపించింది. ''ఆ చిత్రాన్ని గీసినందుకు చిత్రకారుడికి వెయ్యి బంగారు నాణాలు బహుమతిగా ఇచ్చాను! దానిని గురించి అభిప్రాయం ఏమిటి?'' అని సమాధానం కోసం సభికులకేసి చూశాడు.



రాజు సమీపంలో కూర్చున్న సభికుడొకడు లేచి నిలబడి, ''చిత్రపటం చాలా అందంగా ఉంది మహారాజా! ఈ చిత్రం ముమ్మూర్తులా మిమ్మల్నే పోలిఉన్నది. దానిని ఎవరు చిత్రించారు ప్రభూ!'' అన్నాడు నవ్వుతూ.



రాజు సమాధానం చెప్పలేదు. ''చాలా అందంగా ఉంది!'' ''అద్భుతంగా ఉంది!''అనే మాటలు రాజుకు వినిపించాయి. అయితే సభలోనే ఉన్న తెనాలిరామలింగడు మాత్రం నోరువిప్పకుండా ఉండడం రాజు గమనించి,అతడికేసిచూస్తూ, ''రామలింగా! నీ అభిప్రాయం ఏమిటి?''అని అడిగాడు.



"అయినా, చిత్రంలో తమ మోము మరొకమెప్పు కనిపించడంలేదేం ప్రభూ! ఎప్పుడో ఒకప్పుడు నేను ఇంతకన్నా ఉత్తమచిత్రం చిత్రిస్తాను," అన్నాడు తెనాలి రామలింగడు. రాజుకు ఆ మాట ఆగ్రహం కలిగించింది. "చిత్రాన్ని చూసి ఆనందించాలంటే ఎంతో ఊహించుకోవాలి. వెళ్ళు! నువ్వు దీనికన్నా గొప్ప చిత్రం గీసేంతవరకు తిరిగి రావద్దు!" అని ఆజ్ఞాపించాడు రాజు.



ఒకనెల గడిచింది. రామలింగడి అచూకీ తెలియలేదు. రాజు ఒకనాడు సభలో, "రామలింగడెక్కడ? ఇంకా చిత్రలేఖనం చేస్తూనే ఉన్నాడా?" అని అడిగాడు. "అతడు చిత్రం గీస్తూండడం మేమెవ్వరం చూడలేదు, ప్రభూ!" అన్నాడు ఒక సభికుడు. "అసలు కుంచె పట్టుకోవడం అతనికి చేతనవునా?" అని మరొక సభికుడు అనడంతో సభికులు గొల్లుననవ్వారు. అప్పుడే తెనాలిరామలింగడు సభలోకి అడుగుపెట్టాడు.



సభలోకి రాగానే రామలింగడు వంగి రాజుకు నమస్కరించి, "నేను గీసిన చిత్రం చూపడానికి ప్రభువులు అనుమతించాలి!" అన్నాడు. తెనాలి రామలింగడి వెనకవచ్చిన ఇద్దరు భటులు, అతడు చుట్టగాచుట్టి తెచ్చిన పొడవాటి వస్త్రాన్ని విప్పి చూపారు. సభికులు ఒక చివరినుంచి ఇంకొక చివరివరకు చిత్రాన్ని ఒక్కసారిగా చూడలేక పోయారు. "ఏమిటీ చిత్రం! పెద్ద గుర్రం తోక తప్ప మరేదీ కనిపించడంలేదు!" అన్నాడు రాజు.



"మహాప్రభూ! ఒక చిత్రాన్ని చూసి ఆనందించాలంటే ఎంతో ఊహించుకోవాలి కదా ప్రభూ! మిగతావాటిని తమరే ఊహించుకోవాలి. గడ్డి తిన్నాక గుర్రం ముందుకు వెళ్ళిపోయింది. అందువల్లే దాని శరీరం చిత్రానికి వెలుపల ఉన్నది!" అన్నాడు తెనాలి రామలింగడు.

## కేరళ 'బ్రేక్' డ్యాన్స్!

కొయ్య పలకలతో అమర్చిన వేదికపై యాభైమంది దృఢకాయులు అదేపనిగా గెంతులు వేస్తూ దూకితే ఏమవుతుంది? కొంత సేపటికి వేదిక విరిగిపోయి నేలమట్టమవుతుంది. కేరళకు చెందిన అంతగా ప్రాచుర్యం పొందని 'చవిట్టు నాటకం' పతాక సన్నివేశం ఇది!

16వ శతాబ్దంలో పోర్చుగీసులు కేరళ ప్రాంతంలో అడుగుపెట్టినప్పుడు, తమతో పాటు యూరోపియన్ ఓపెరా సంప్రదాయాన్ని కూడా వెంటబెట్టుకుని వచ్చారు. ఈ సంప్రదాయమూ, స్థానికంగా ఉన్న 'కథకళి' సంప్రదాయమూ కలిసి 'చవిట్టు నాటకం' అనే సరికొత్త నాట్యపద్ధతి రూపొందడానికి దోహదం చేశాయి.



కథాంశాలను క్రైస్తవ మత సంబంధమైన కథల నుంచీ, యూరపు చరిత్ర నుంచీ స్వీకరించి, ఈ నృత్య నాటికలను తయారు చేస్తారు. పాత్రధారులే తమ పాటలను పాడటం వీటి ప్రత్యేకత. కథకళిలో లాగే ఈ నృత్య నాటికలు కూడా యుద్ధంతోనే ముగుస్తాయి. దీనికోసం దాదాపు యాభైమంది దృఢకాయులు ఒక్కసారిగా వేదిక మీదికి వస్తారు. వేదిక ఎంతటి బలమైన చెక్కలతో అమర్చినదైనప్పటికీ, దానిమీదికి వచ్చిన ఈ 'యుద్ధవీరుల' గెంతులకు అది విరగకపోతే ప్రదర్శన విజయవంతం కానట్టే లెక్క!

## వెచ్చదనం రహస్యం!

మీరెప్పుడైనా కాశ్మీరుకు వెళ్ళారా? మరీ శీతాకాలంలో అయితే నెత్తురు గడ్డకట్టే చలి! అయినా ఇంతటి శీతల వాతావరణంలో కాశ్మీరీలు ఎలా హాయిగా ఉండగలుగుతున్నారు? అందంగానూ, అందమైన నవ్వులతోనూ ఎలా తిరగ్గలుగుతున్నారు? అని మీరు ఆశ్చర్యపోతున్నారా? తమ బట్టలకింద భద్రపరిచే 'అంగితి' లోనే అసలు రహస్యం ఉంది! 'అంగితి' అంటే నిప్పుకణికలతో నిండిన మట్టిపిడత. దానినొకచిన్న వెదురుబుట్టలోపెట్టి, నడుముచుట్టూ ఉన్న వస్త్రాల మధ్య బిగించి కట్టుకుంటారు. అది వాళ్ళ శరీరాలకు కావలసిన వెచ్చదనాన్నిస్తుంది! అదన్న మాట అసలు రహస్యం!



# మల్లఖంబ్!



పదవ శతాబ్దానికి చెందిన చాళుక్యుల నాటి సాహిత్యంలో ఈ 'మల్లఖంబ్' క్రీడల ప్రసక్తి ఉంది. ఆ తరవాత ఇది కనుమరుగైపోయినప్పటికీ 19 వ శతాబ్దంలో రెండవ పీష్వా బాజీరావు కాలంలో పునఃప్రారంభమయింది. ఈనాడు 'మల్లఖంబ్'లో రక రకాల క్రీడలు వచ్చాయి. జాతీయ స్థాయిలో పోటీలు కూడా నిర్వహిస్తున్నారు!





భారతదేశంలో ముఖ్యంగా మహారాష్ట్ర ప్రాంతంలో ప్రసిద్ధి గాంచిన ప్రాచీన క్రీడ 'మల్ల ఖంబ్'. క్రీడాకారుల శక్తిసామ ర్థ్యాలనూ, శరీరం రబ్బరులా వంగే స్వభావాన్నీ, వేగంగా తిరిగే శక్తినీ ప్రదర్శించడానికి ఇది ఉపయోగపడుతుంది. నేలమీద ఒకపొడవాటి గడను నాటుతారు. క్రీడాకారుడు ఆ గడ కొసకు చకచకా ఎగబ్రాకి వెళ్ళి, బ్యాలెన్స్ తప్పకుండా రకరకాల విన్యాసాలను ప్రదర్శిస్తాడు.

# వరి చేలలో చేపల పంట!



ఇదేమిటి! అని ఆశ్చ ర్యపోతున్నారా? అయినా ఇది అక్షరాలా నిజం! అరు ణాచలప్రదేశ్‌కు చెందిన 'అపాటివిస్' అనే తెగల ప్రజలు ఈ విలక్షణమైన పద్ధతిని అనుసరిస్తున్నారు. వెల్లువదారిలో ఉన్న వరి చేలలో-నాట్లు పూర్తయి, మొక్కలు వేళ్ళూని చిన్న చిన్న చేపల తాకిడికి తట్టు కోకలిగిన దశలో, చేపపిల్ల లనువదులుతారు. వాటితో పాటు చిన్నచిన్న పురుగుల్నీ మొక్కల్నీకూడా ఆహారంగా వేస్తారు. వరిపంట పెరిగి వెన్ను వచ్చి, పంట కోతకు సిద్ధమయ్యేలోగా, వాటి లోని చేపలు కూడా పెరిగి పెద్దవవుతాయి!

మన పండుగలు

# వసంత పంచమి

వసంతరుతువు రాకను భారతదేశమంతటా వసంతపంచమి పండుగగా ఉత్సాహంగా జరుపుకుంటారు. ఈ పండుగ మాఘ శుక్ల పంచమినాడు (జనవరి–ఫిబ్రవరి) వస్తుంది. తూర్పు భారతదేశంలో దీనిని సరస్వతీ పూజగా జరుపుకుంటారు. జ్ఞానానికి అధిదేవత సరస్వతి. ఆమె జ్ఞానస్వరూపిణి. శాస్త్రం, కళలు, విజ్ఞానం, హస్తకళలు మొదలైన వాటిని చదువుల తల్లి సరస్వతి అంశాలుగా మన పెద్దలు భావించారు. సృజనాత్మక శక్తికీ, స్ఫూర్తికీ కూడా వీణాపాణి అయిన సరస్వతిని సంకేతంగా చెప్పడం మన సంప్రదాయం.

పశ్చిమబెంగాల్‌లో ఈరోజున సరస్వతీ విగ్రహాలను పూజిస్తారు. పుస్తకాలనూ, సంగీత





వాద్యాలనూ సరస్వతి విగ్రహం ముందు ఉంచుతారు. ఈ రోజు పిల్లలు చదవరు! పూజానంతరం సరస్వతీ విగ్రహాన్ని సముద్రంలోనో, నదిలోనో నిమజ్జనం చేస్తారు. మరునాడు పూజలు చేసిన తరవాతే విద్యార్థులు పుస్తకాలు తెరుస్తారు. ఈ ప్రాంతంలో సరస్వతి పూజ సందర్భంగా ఈ రోజున చిన్నారి పాపలు సైతం చీరలు కట్టుకోవడం విశేషం!

ఈ రుతువులో ప్రత్యేకంగా పూచే, 'బసాకా' పువ్వులతో, పసుపురంగు 'గాండా' పుష్పాలతో సరస్వతీ దేవిని పూజిస్తారు.

ఉత్తర భారతదేశంలో ముఖ్యంగా పంజాబ్ ప్రాంతంలో వసంతపంచమి రోజున గాలి పటాలు ఎగురవేస్తారు. చాలా చోట్ల, ఈ రోజు

గాలిపటాల పందాలు కూడా జరుపుతారు.

చెట్లన్నీ చిగురిస్తాయి. ప్రకృతి వింత శోభతో, రకరకాల పూలతో కళకళలాడే కాలం వసంతం. ఉత్తరభారతదేశంలో ఆవతోటలు మెరిసే పసుపు పచ్చపూలతో నేలతల్లికి బంగారు చేలం తొడిగి నట్టు కనిపిస్తాయి. మనుషులు కూడా పసుపు పచ్చరంగు దుస్తులు ధరించి, వసంతోత్సవాలలో పాల్గొనడం ఇక్కడ చెప్పుకోతగ్గ విశేషం!

# కార్నివాల్

ఫిబ్రవరి నెలలో గోవా సముద్రతీరం ఆనందో త్సాహాలతో, సంగీతంతో మారు మోగుతుంది. ఇక్కడి ప్రజలు మూడు రోజులపాటు ఆనందో త్సాహాలతో 'కార్నివాల్' అనే పండుగ జరుపు కుంటారు. ఇది ఆటపాటలతో ఆనందం వెల్లి విరిసే సమయం.

కార్నివాల్ జరిగే మూడు రోజులూ తన దేశప్రజలు ఎలాంటి పనిపాటులూ చేయ కూడదని ఒకానొకప్పుడు గోవాను పరిపాలిం చిన మోమోరాజు ప్రకటించినట్టు గోవా ప్రజలు విశ్వసిస్తారు!

రకరకాల రంగులతో అందంగా అలంక రించబడిన తెప్పకొయ్యల (ఫ్లోట్స్)మీదా, శకటాలలోని వేదికలమీదా గాయనీ గాయ కులూ, నృత్యకారులూ ఆడుతూ, పాడుతూ ప్రదర్శనలిస్తారు. వీటికని ప్రత్యేకంగా విభిన్న ఆకారాలతో శకటాలు తయారు చేస్తారు. ప్రదర్శకులు ముఖాలకు రంగు రంగుల తొడుగులు ధరిస్తారు.

చారిత్రక అంశాలు, ఘట్టాలు ఆధారంగా చిన్నచిన్న నాటకాలు, నాటికలు ప్రదర్శిస్తారు. వీటిని 'ఫేలోస్' అని అంటారు. వీటిని కూడా 'ఫ్లోట్స్' వేదికలపై ప్రదర్శిస్తారు. కార్ని వాల్ సందర్భంగా ప్రదర్శించే నాటికలలో



పురుషులే వివిధ పాత్రలు ధరించడం సంప్రదాయంగా వస్తున్నది. నాటికలలో అంతర్భాగంగా సంగీతం, నృత్యం ప్రేక్షకులను అలరిస్తాయి.

పురుషులు ముఖాలకు గాఢమైన రంగులు పూసుకుని, చిత్రవిచిత్రమైన రంగుల దుస్తులూ, సంప్రదాయానుసారంగా వస్తూన్న తలపాగాలూ ధరిస్తారు. కార్నివాల్ ఉత్సవాలకు కొన్ని నెలల ముందు నుంచే వాళ్ళు ఈ ఆటపాటలలో శిక్షణ పొందుతూ, ఒద్దిగ చూస్తారు. తెల్లవారగానే ఆరంభమయ్యే ఈ నాటకాలు సాయంకాలంవరకు సాగి ఆ తరవాత రాత్రి కూడా జరుగుతాయి. ఒకచోటి నుంచి నాట్యకారులు మరొక చోటికి వెళతారు. వాళ్ళు ఎక్కడికి వెళ్ళినా ప్రజలు తండోపతండాలుగా వస్తారు.

గోవాను, పోర్చుగీసులు పరిపాలించినప్పుడు 'కార్నవాల్'ను 'పోర్కో బ్రూటిల్' అనేవారు. క్రీ. శ. 1700 ప్రాంతంలో కార్నవాల్‌సందర్భంగా వీధులలో (మాక్‌బ్యాటిల్స్) 'తమాషా'యుద్ధాలు జరిగేవి. కోడిగుడ్లు, పిండితో నిండిన సంచులు ఒకరిపై ఒకరు విసురుకుంటూయుద్ధంచేసేవారు.



# దోస్‌మోచ్



లధక్, జమ్మూ-కాశ్మీర్ ప్రజలు ఇప్పటికీ పాటిస్తూన్న ప్రాచీన సంప్రదాయం-దోస్‌మోచ్. యేటా ఫిబ్రవరి నెలలో లేహ్‌భవనంలో మృదంగ సంగీతం ఆరంభమవుతుంది. ఈ రోజు చుట్టు పక్కలనున్న బౌద్ధమఠాలనుంచి వచ్చిన లామాలు ముఖాలకు తొడుగులు ధరించి నృత్యనాటికలు ప్రదర్శిస్తారు. సంప్రదాయానుసారం ఇచ్చే నైవేద్యాలను లామాలు తయారు చేస్తారు; వాటికి పవిత్రత కలిగించి, ఆఖరుగా ఆహుతి ఇస్తారు.

ముఖ్యంగా వాళ్ళు సమర్పించే నైవేద్యం దారాలతో తయారుచేసే శిలువల్లాంటి చిక్కుముడులు. వీటిని లామాలు టాక్‌థోక్ మఠంలో తయారుచేస్తారు. అక్కడి లామాలు జ్యోతిషం, మంత్రతంత్రాల వంటి విద్యలలో నిపుణులని చెబుతారు. లామాలు నిర్ణీత క్రతువును నిర్వహించి, నిర్దిష్ట మంత్రాలను వల్లించినట్టయితే- దుష్టశక్తులనూ, ఆకలిగొన్న దయ్యాలనూ, రాక్షసశక్తులనూ తమలోకి ఆకర్షించి కట్టిపడేసే

అద్భుతశక్తి నైవేద్యాలకు వస్తుందని వాళ్ళు విశ్వసిస్తారు. ప్రధానమైన నైవేద్యంతో విభిన్న పరిమాణాలలో మరొక పదిరకాల నివేదనలను కూడా సమర్పిస్తారు.వాటిని ఊరేగింపుగా ప్రధాన వీధులగుండా తీసుకువెళతారు. ముందు మతాల వాద్యకారుల సంగీతం; దాని వెనక నల్లటోపీలు పెట్టుకున్నవారి నాట్యప్రదర్శన; దానికి వెనక లామాలు; వాళ్ళను అనుసరించి అందమైన దుస్తులతో అలంకరించుకున్న స్థానిక ప్రజలు నడుస్తారు.

పట్టణం చివరికి వచ్చాక ఊరేగింపు పూర్తవుతుంది. ఇక్కడే నైవేద్యాలను అమితోత్సాహంతో కాల్చి నాశనం చేస్తారు. దుష్టశక్తులన్నిటినీ, నాశపరచి రానున్న సంవత్సరంలో ప్రకృతివైపరీత్యాలనుంచీ, గండాల నుంచీ తమకు రక్షణ కల్పించాలన్న కోరికతో ఈ తతంగం జరుపుతారు. ఇటీవలి కాలంలో ఈ సంరంభానికి మధ్య కొన్ని జానపద నృత్యాలను కూడా ప్రదర్శిస్తున్నారు.



# 'బూడిద బుధవారం'

ఈ సంవత్సరం ఫిబ్రవరి 20వ తేదీన 'యాష్ వెండ్స్‌డే'(బూడిదబుధవారం) వస్తున్నది. ఈ రోజు క్రైస్తవులు తమ చిన్నా,పెద్దా పాపాలకు ప్రాయశ్చిత్తంగా నుదుట చిన్న బూడిదశిలువను ధరిస్తారు. ప్రార్థనలు ప్రారంభించడానికి ముందు ప్రధాన పూజారి గుమిగూడిన ప్రజల నుదుట 'బూడిద శిలువ'ను దిద్దుతాడు.

ఈ శిలువను దిద్దడానికి ఉపయోగించే బూడిదను గతయేడాది 'పామ్ సండే' రోజున ఆశీర్వదించబడిన 'పామ్ చిగురుటాకుల' నుంచి తయారుచేస్తారు. ఈ బూడిదపై పవిత్రజలం చిలకరించి, వాసనద్రవ్యాలు కలుపుతారు.

ఏసుక్రీస్తు తన బోధనలను బోధించడానికి ముందు నలభైరోజులు ఉపవాసంతో ఏకాంతంలో గడిపాడని చెబుతారు. దానిజ్ఞాపకార్థంగానే క్రైస్తవులు దీనిని జరుపుకుంటారు.ఏసుక్రీస్తు 32 ఏళ్ళ వయసువాడుగా ఉన్నప్పుడు బాప్టిస్ట్ జాన్‌ద్వారా జ్ఞానస్నానం చేయబడ్డాడని చెబుతారు. ఆ తరవాత ఆయన తన సిద్ధాంతాలను బోధించి, దీనుల బాధలు తీర్చడానికి ఉపక్రమించడానికి ముందు నలభైరోజులు ఉపవాసంతో గడిపాడని చెబుతారు.



నిర్మలజీవితం సాగిస్తూ ప్రత్యేక పవిత్రీకరణకు దోహదంచేసే 'లెంట్' అనే నలభైరోజుల వ్రతారంభాన్ని 'యాష్‌వెండ్స్‌డే' సూచిస్తుంది. ఈ రోజుల్లో క్రైస్తవులు కొందరు మాంసాహారానికిసైతం దూరంగా ఉంటారు. ఇలా నలభైరోజులు సాగే తపస్సులాంటి దీక్ష ఈస్టర్ పండుగతో పూర్తవుతుంది.

# భారత సంస్కృతి-చరిత్ర

ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

## 25. కథా సరిత్సాగరం!



తమ పాఠశాల వార్షికోత్సవం సందర్భంగా తాము ప్రదర్శించిన అభిజ్ఞాన శాకుంతల నాటకం విజయవంతం కావడంతో సందీపుడు చాలా సంతోషించాడు. ఆ నాటకంలో సందీపుడు కణ్వముని పాత్ర ధరించి, చక్కగా నటించాడు. అందరూ మెచ్చుకున్నారు.

"తాతయ్యద్వారా మన ప్రాచీన మునుల గురించి చాలా విని వుండడంవల్ల కణ్వ మహర్షి పాత్ర నాకు కొత్తగా అనిపించలేదు," అన్నాడు సందీపుడు.

"దుర్వాసముని పాత్ర అయితే ఇంకా బాగా చేసి 'ఉండేవాడివి. కావాలంటే నేను పందెం కడతాను," అన్నది శ్యామల.

"నోర్ముయ్!" అన్నాడు సందీపుడు కోపంగా.

"ఆహా! నా అభిప్రాయం అక్షరాలా నిజమని నిరూపించావు. చాలా కృతజ్ఞతలు!" అంటూ చప్పట్లు కొడుతూ నవ్వింది శ్యామల.

ఆదివారం సాయంకాలం అక్కడ చేరిన వాళ్ళ స్నేహితులందరూ పకపకా నవ్వారు.

సందీపుడి స్నేహితుడు తనచుట్టూ ఉన్న మిత్రులతో, "ఎప్పుడో శతాబ్దాల పూర్వం రచించిన నాటకాన్ని ఇప్పుడు ప్రదర్శించడం; దానిని చూసి ప్రేక్షకులు ఆనందించడం ఆశ్చర్యంగా వుంది. ఒకానొకప్పుడు రాజు విక్రమాదిత్యుడు ఆ నాటకం చూసి ఆనందించినట్టు ఇప్పుడు తాతయ్యగారు ఆనందించి ఉంటారు!" అన్నాడు.

"నేను ఆనందించాను, నిజమే. అయితే నాకన్నా ఎక్కువ ఆనందాన్ని అనుభవించి ఉంటాడు

విశ్వావసు



రాజు విక్రమాదిత్యుడు. ఎందుకంటే అప్పుడు రాజు సంభాషణలను ఆ నాటకం రచింపబడిన సంస్కృతభాషలోనే విని ఉంటాడు. నాటకం మరొక భాషలోకి అనువదించబడేప్పుడు మూలభాష లోని అందం, గాంభీర్యం, మాధుర్యం కొంతలో కొంతైనా తగ్గిపోతాయి,'' అన్నాడు దేవనాధుడు.

''తాతయ్యా! మహాకవి కాళిదాసును తన ఆస్థానంలో పోషించిన విక్రమాదిత్యుణ్ణి గురించే కదా మీరు చెబుతున్నారు?'' అని అడిగింది శ్యామల.

''మీరు చరిత్ర పాఠాల్లో ఒకే ఒక విక్రమాది త్యుణ్ణి గురించేనా చదువుతున్నారు? విక్రమా దిత్యుడు అంటే సూర్యుడికి సమానమైన శౌర్య పరాక్రమాలు కలిగినవాడు అని అర్థం. ఆ బిరుద నామంతో పలువురు రాజులున్నారు. అటువంటి వారిలో క్రీ.శ. నాలుగవ శతాబ్దంలో ఉజ్జయినీ నగరం రాజధానిగా పరిపాలన సాగించిన గుప్తవంశానికి చెందిన రెండవ చంద్రగుప్తుడు ఒకడు. అయినప్ప టికీ, క్రీ.పూ. 1వ శతాబ్దంలో విక్రమాదిత్యుడనే గొప్పరాజు మనదేశాన్ని పరిపాలించాడు. ఆయన పరిపాలనకు గుర్తుగానే విక్రమశకం ఆరంభ మయింది. క్రీ.పూ. 58 వసంవత్సరంతో ఈ విక్రమ శకం ఆరంభమవుతున్నది. అయితే, చరిత్ర ఆ విక్రమాదిత్యుణ్ణి గురించి ప్రస్తావించడం లేదు. ఆయన కాలంలో సుప్రసిద్ధుడైన విక్రమశకానికి ఆద్యుడైన విక్రమాదిత్యుడి ఆస్థానంలో గానీ, రెండవ చంద్రగుప్తుడి ఆస్థానంలోగాని మహాకవి కాళిదాసు ఉండిఉండాలి!'' అన్నాడు దేవనాధుడు.

''మరి, బేతాళ కథల్లో వచ్చే విక్రమార్కుడి మాటేమిటి, తాతయ్యా?'' అని అడిగింది శ్యామల.

''ఆయన క్రీ.శ. ఒకటవ శతాబ్దంలో ఉజ్జయినిని పాలించిన విక్రమార్కుడే అయిఉంటాడు. ఎందు కంటే బేతాళ కథలను రచించిన గుణాఢ్యుడు ఒకటవ శతాబ్దంలోనే జీవించాడు. ఆ రాజు శౌర్య పరాక్రమాలనూ, కీర్తిప్రతిష్ఠలనూ విని ఆ స్ఫూర్తితో గుణాఢ్యుడు తన రచనలు చేసి ఉంటాడు,'' అన్నాడు దేవనాధుడు.

''అయితే, బేతాళ కథలను సోమదేవుడు రచించినట్టు మా ఉపాధ్యాయులు చెప్పారే!'' అని తన సందేహం వ్యక్తం చేశాడు ప్రదీపుడు.

''అవును. మీ ఉపాధ్యాయులు చెప్పిందీ నిజం; నేనన్నదీ నిజం. సుప్రసిద్ధమైన కథాసరిత్సా గరం అనే గ్రంథాన్ని సోమదేవుడు రచించాడు. నువ్వు చెప్పిన బేతాళ కథలు, ఈ గ్రంథంలోని ఒక భాగం. ఆ గ్రంథం పేరు బృహత్కథ. సోమదేవుడికి వెయ్యేళ్ళకు పూర్వం గుణాఢ్యుడు దానిని రచిం చాడు. ఆ మహాగ్రంథంలో మరెన్నో ఆసక్తికరమైన కథలు ఉండి ఉండాలి. ఆ గ్రంథంలోని ఎక్కువ భాగం నాశనమైపోయింది,'' అన్నాడు దేవనాధుడు బాధగా.

''ఎలా నాశనమైపోయింది, తాతయ్యా?'' అని అడిగాడు ప్రదీపుడు.

''అదొక విషాద ఉదంతం!'' అంటూ దేవ నాధుడు నిట్టూర్చి దానిని గురించి చెప్పసాగాడు:

ప్రస్తుతం మనం పైఠాన్ అని పిలుస్తున్న నగరం అసలు పేరు ప్రతిష్ఠానపురం. దాదాపు



రెండువేల సంవత్సరాలకు పూర్వం ఆ నగరాన్ని శాతవాహన వంశస్థులు పరిపాలించారు. ఒకానొక శాతవాహనరాజు కొలువులో గుణాఢ్యుడు ఆస్థాన కవిగా ఉండేవాడు.

ఒకప్పుడు రాజుకు సంస్కృతం నేర్చుకోవాలనే కోరిక కలిగి, ఆ సంగతి గుణాఢ్యుడితో చెప్పాడు. సంస్కృతం చాలా క్లిష్టమైన భాష. దానిని నేర్చుకో వడానికి కొన్ని సంవత్సరాలు పట్టవచ్చని గుణా ఢ్యుడు చెప్పాడు. అయితే, పక్కనే ఉండి ఆ మాట విన్న మరొక పండితుడు, "అదేంకాదు; ఆరు మాసాలలో నేను రాజుగారికి సంస్కృతం నేర్పగలను," అన్నాడు.

ఆ మాటకు ఆగ్రహించిన గుణాఢ్యుడు, "నువ్వేగనక ఆ పని చేయగలిగితే, నేను ఆ తరవాత సంస్కృతంలో రచనలు చేయడమే మానుకుంటాను," అన్నాడు.

. ఆరు నెలలు గడిచింది. యువకుడైన రాజు కుశాగ్రబుద్ధి, అధ్యయనశీలీ కావడంతో నిజం గానే ఆరు నెలలలో పట్టుబట్టి సంస్కృత భాషను చక్కగా నేర్చుకున్నాడు. గుణాఢ్యుడు సంస్కృతంలో రచించడం మానడమే కాదు; ఆ నగరాన్నే వదిలిపెట్టాలని నిర్ణయించి, ఆ విషయం రాజుకు చెప్పాడు.

"మిత్రమా! నువ్వు మమ్మల్ని వదిలి వెళ్ళడం బాధాకరంగా ఉన్నది. అయినా, నువ్వు పట్టిన పట్టు వదలనంటున్నావు. ఒకవిన్నపం వింటావా?" అని అడిగాడు రాజు.

"చెప్పండి!" అన్నాడు గుణాఢ్యుడు.

"అమూల్యమైన నీ జీవిత సమయాన్ని వృథా చేయకుండా దేశమంతా పర్యటించు. వివిధ ప్రాంతాలలో ప్రజలు చెప్పుకునే కథలను సేక రించు. వాటిని మామూలు ప్రజల భాషలో రచించు. ఇదే నా కోరిక," అన్నాడు రాజు.

గుణాఢ్యుడికి రాజు సూచన ఎంతగానో నచ్చింది. దానిని ఆజ్ఞగా శిరసావహించి, కొన్ని సంవత్సరాలు ఆసేతుహిమాచలం పర్యటించాడు. వేలాది ప్రజల నోళ్ళగుండా లక్షలాది కథలు విన్నాడు. వాటన్నిటినీ ఐదు భాగాలుగా విభజించి, సంకల నాలు తయారు చేశాడు. ఒక బండి నిండుగా తాళపత్ర గ్రంథాలతో, మనసు నిండా ఆనందంతో

ప్రతిష్ఠానపురానికి తిరిగి వచ్చాడు. రాజు తనకు ఘనస్వాగతం పలుకగలడని ఆశించాడు. అయితే, ఆయన ఆశించింది జరగలేదు. రాజు ఎందుకో ఉదాసీనత కనబరచాడు. దాంతో గుణాఢ్యుడు తీరని ఆశాభంగానికి గురయ్యాడు. భరించరాని ఆవేదనతో, తాళపత్రాలతో దాపులనున్న కొండ శిఖరానికి వెళ్ళాడు. అప్పటికే సాయంకాలమయింది. ఆకాశం మేఘావృతమైవుంది. పెద్దమంట రగిలించాడు. ఆ మంట వెలుగులో తన సంకలనంలోని మొదటి భాగాన్ని తీసి ఆవేశంతో బిగ్గరగా చదివాడు. అది ప్రకృతికి సంబంధించినది. ఆయన కథలు చదువుతూంటే ప్రకృతి పులకరించింది. మేఘాలు నర్తించాయి; మెల్లమెల్లగా గాలులు వీచాయి. అయితే ఆయన తాళపత్రాలను అగ్నికి ఆహుతి ఇచ్చినప్పుడు గాలులు చండప్రచండంగా వీచాయి; మేఘాలు ఉరుములతో ప్రళయగర్జన చేశాయి!

ఆ తరవాత ఆయన రెండవభాగం చదవడం మొదలుపెట్టాడు. అది జంతువులకూ, పక్షులకూ, చెట్లకూ సంబంధించినది. ఆయన గట్టిగా చదువుతూ ఉంటే—తమ కథలను వినడానికి జంతువులు ఆయన చుట్టూ చేరాయి. పక్షులు దాపులనున్న చెట్లమీదికి వచ్చి వాలాయి. చదవడం పూర్తిచేసి తాళపత్రాలను అగ్నిలో వేసినప్పుడు జంతువులు విలపించాయి; పక్షులు గోలపెట్టాయి; చెట్లు మంటలనార్పడానికి ముందుకు వాలాయి. అయినా ప్రయోజనం లేకపోయింది!

అంతలో కొండమీద జరుగుతూన్న విలయాన్ని రాజుకు ఎవరో చెప్పారు. రాజు హుటాహుటిగా వచ్చి, గుణాఢ్యుణ్ణి కౌగలించుకుని, అగ్నిని ఆర్పేలా చేశాడు. అయినా, అప్పటికే గుణాఢ్యుడు ఐదు భాగాలుగా రచించిన బృహత్కథలోని నాలుగు భాగాలు అగ్నికి ఆహుతై పోయాయి!

పదకొండవ శతాబ్దంలో కాశ్మీరును పరిపాలించిన అనంతుడి ఆస్థానకవి సోమదేవుడు దానిని సంస్కృత భాషలోకి అనువదించాడు. తమ పుత్రుల దుష్ప్రవర్తన కారణంగా బాధాతప్త హృదయులైన వృద్ధ రాజదంపతులకు, సోమదేవుడు రచించిన ఈ కథలు ఎంతో ఊరట, ఓదార్పు కలిగించాయని చెబుతారు.

"ఆహా! కథల వెనక ఎన్నెన్ని ఆసక్తికరమైన కథలు ఉన్నాయి!" అంటూ ఆశ్చర్యపోయింది శ్యామల! -(ఇంకావుంది)





# విఘ్నేశ్వరుడు

దేవతలూ, రాక్షసులూ కలిసికట్టుగా క్షీర సాగరమథనం చేసి అమృతాన్ని సాధించారు. విష్ణువు జగన్మోహినీ రూపంతో రాక్షసులను మోసపుచ్చి అమృతాన్ని దేవతలపాలు చేశాడు. అమృతం తాగి అమరత్వం పొందిన దేవతలు గర్వంగా తిరగసాగారు. దానవులకు జరిగిన అన్యాయానికి దేవతలపై కసి తీర్చుకోడానికి తారకాసురుడు ఘోరమైన తపస్సు చేసి, బ్రహ్మదేవుణ్ణి మెప్పించి, చావులేని వరం కోరాడు.

''పుట్టాక ఎప్పుడో ఒకప్పుడు చావు తప్ప నిది; మరోవరం ఏదైనా కోరు, ఇస్తాను,'' అన్నాడు బ్రహ్మదేవుడు.

తారకాసురుడు బాగా ఆలోచించి శివుడి కుమారుడివల్లనే తప్ప మరేవిధంగానూ తనకు చావులేని వరాన్ని బ్రహ్మనుంచి పొందాడు. అప్పటికి శివుడి భార్య సతీదేవి దక్షయజ్ఞంలో యోగాగ్నితో తనువు చాలించింది. శివుడు ఉన్మత్తుడిలాగ తిరిగి, తిరిగి హిమాలయ పర్వతాల్లో ఒకచోట విరాగిగా కఠోర దీక్షతో తపస్సు చేస్తూ ఉన్నాడు.

తారకాసురుడు రాక్షసులందర్నీ కూడ గట్టుకొని విజృంభించాడు. ముల్లోకాలనూ ఆక్రమించుకుని, కసితీరా దేవతలను చిత్ర హింసలు పెట్టసాగాడు. ఇంద్రాది దేవతలు హడలిపోయి, తమ దీనావస్థను బ్రహ్మతో మొరపెట్టుకున్నారు.

''శివుడికి కుమారుడు పుట్టాలి, అతని వల్లనే తారకుడు చావాలి! అలాంటి వరాన్ని తారకుడికి ఇచ్చాను మరి. ఇంకెరివల్లా తారకాసురుడికి ఎటువంటి హానీజరగదు. మరోవిధంగా అతడికి చావూ లేదు!'' అని బ్రహ్మ చెప్పి దేవతలను వెంటబెట్టుకుని తరుణోపాయం కోసం విష్ణువు దగ్గరికి దారి తీశాడు.

''సతీదేవి హిమవంతుడికి కూతురుగా పుట్టి పార్వతిగా పెరుగుతూ ఉన్నది. శివుడికి పార్వతికి పెళ్ళిజరిగేలా చూడండి!'' అని



విష్ణువు చెప్పాడు. దేవతలు నారదుణ్ణి హిమవంతుడి దగ్గరికి పంపించారు.

నారదుడి ఆదేశం ప్రకారం హిమవంతుడు సతీసమేతంగా, తపస్సులో నిమగ్నుడై ఉన్న శివుడి దగ్గరికి వెళ్ళి, పూజించి తన కుమార్తె పార్వతి అతని తపస్సుకు అనుకూలంగా పరిచర్యలు చేస్తూండడానికి అనుమతించవలసిందని కోరాడు.

శివుడి మౌనాన్ని అంగీకారంగా గ్రహించి హిమవంతుడు పార్వతిని శివుడికి పరిచర్యలు చేయడానికి పురమాయించాడు.

చిన్నతనం నుంచీ పార్వతికి శివుడంటే చాలా ఇష్టం. బాలపార్వతికి నారదుడు శివుడి గురించి అనేక విషయాలు చెపుతూండేవాడు. శివుడి కథలనూ, గుణగణాలనూ, మహిమలనూ పదేపదే వినడానికి కుతూహలపడుతూ ఉండేది పార్వతి. పెళ్లాడితే శివుణ్ణే పెళ్ళాడాలని ఉవ్విళ్లూరేది. అటువంటి శివుడికి పరిచర్యలు చేయడం తరుణప్రాయంలో ఉన్న పార్వతికి మహాభాగ్యంగా తోచింది.

తెల్లవారుతూండగా శివుడు తపస్సు చేస్తున్న పరిసర ప్రాంగణమంతా నెమలి పింఛపుకట్టతో తుడిచి, హిమానీ జలాల్లో మంచిగంధం కలిపి కల్లాపుజల్లి, ముత్యాల ముగ్గులు తీర్చేది. బంగారు తీగెలతో అల్లి, రత్నాలు కెంపులు పొదిగిన తట్టతో శివుడికి ఇష్టమైన ఫల పుష్పాలను, మారేడు పత్రినీ, తెల్లకలువలనూ తీసుకెళ్ళి పక్కనుంచేది. బంగారు కమండలువు నిండా హిమశిఖరాల నుంచి జారే స్ఫటిక జలాలను నింపి, జపమాలతో కలిపి అమర్చిపెట్టేది. శివుణ్ణి ఆకర్షించడానికి ఎన్నోవిధాలుగా అలంకరించుకుని వెళ్ళేది. కిన్నెరపై శివుడికి ప్రీతికరమైన భైరవి, ముఖారి, కేదార, శివరంజని మొదలైన రాగాల్ని ఆలాపించేది. శివుడి చూపులు తనపై పడాలని పదేపదే ప్రయత్నిస్తూండేది. తపోదీక్షలో నిమగ్నుడై శివుడు ఒక్కసారైనా తనను పరికించ గలడేమోనని, అతని చల్లని చూపులు తనపై వాలాలని పార్వతి శివుడి ముఖాన్ని అలా చూస్తూ ఉండిపోయేది. శివుడు పొరపాటుగానైనా తన వంకచూడడేమో అని నిరాశా, నిస్పృహలతో ఊగిసలాడేది.

శివుడి మనస్సు చలించడానికి మన్మథుడి అవసరం తప్పనిసరి అని గుర్తించి, దేవేంద్రుడు మన్మథుణ్ణి పిలిపించాడు. శివుడికి పార్వతిపై అనురాగం కలిగేలా చేయమని అతణ్ణి అర్థించాడు.

వసంతుడు సారథ్యం చేస్తూండగా మన్మథుడు చెరకు వింటినీ, పూలబాణాలనూ ధరించి రతీదేవితో చిలుకరథాన్నెక్కి, ఈశ్వరుడు

తపస్సు చేస్తూన్న హిమాలయ శిఖరాల నడుమ నున్న లోయను ప్రవేశించాడు. ఒక్కసారిగా ఆ లోయ అంతటా వసంతఋతువు వెల్లివిరి సింది. రమణీయంగా మారింది. కోయిలల సంగీతంతో, తుమ్మెదల ఝుంకారంతో అంతా రసమయంగా వెలిగిపోయింది. తానున్న పరిసరమంతా ఆకస్మికంగా మారిపోయినట్లుగా తోచి, శివుడు కళ్ళు తెరిచి చూశాడు. అకాల వసంతాగమనానికి ఆశ్చర్యపోతూ, తపోభంగ మైనందుకు నొచ్చుకుంటూండగా అతని చేతినుంచి జపమాల జారిపడింది. పార్వతి జప మాల తీసి శివుడికి అందిస్తున్న సమయంలో మన్మథుడు విరియబూచిన నల్ల ఉమ్మెత్త పూలపొద చాటునుంచి నీలోత్పల బాణాన్ని శివుడి గుండెకు గురిపెట్టి వదిలాడు. అది తగలగానే శివుడు తృళ్ళిపడి తేరిపార జూశాడు. అతని మ్రోల మోకరిల్లి రెప్పవాల్చకుండా తననే చూస్తున్న పార్వతి ముఖబింబం ఎంతో మనోహ రంగా కనిపించింది.

తన తపోభంగానికి శివుడు నివ్వెరపడుతూ రుద్రుడై తన మూడవ కంటిని తెరిచి మన్మథు డిని చూశాడు. మరుక్షణంలో శివుడి ఫాల నేత్రం నుంచి వెలువడిన జ్వాలల్లో మన్మథుడు కాలి బూడిద అయ్యాడు. శివుడు దిగ్గున లేచి చరచరా తన కైలాస శిఖరాగ్రం మీదికి వెళ్ళి పోయాడు.

మన్మథుడి వెన్నంటి ఉన్న రతీదేవి భర్త బూడిద కుప్పమీద కూలిపోయి భోరుమ న్నది. బ్రహ్మాది దేవతలు వచ్చి పార్వతీ శివుల కళ్యాణం జరిగినప్పుడు మన్మథుడు తిరిగి బతికి వస్తాడని నచ్చజెప్పి, ఓదార్చి సహగమనం మానిపించారు. రతీదేవి మన్మథుడి బూడిద



కుప్పనే కనిపెట్టుకొని అలా దివారాత్రాలు గడపసాగింది.

పార్వతికి తన సౌందర్యం పట్ల నమ్మకం పోయింది. శరీరలావణ్యం మీద మమకారం పోయింది. శివుణ్ణి రంజింపచేయలేని తన తనువు నిరర్థకంగా తలచి శివరంజనిగా తపస్సు చేయడానికి పూనుకున్నది. కేవలం కొద్ది ఆకు లనుమాత్రమే తింటూ శరీరాన్ని కృశింప జేసుకొని తపస్సు మొదలుపెట్టింది. జయ, విజయ అనే ఇద్దరు చెలికత్తెలు ఆమెకు తోడుగా ఉంటూ ఆమె యోగక్షేమాల్ని మేనకా, హిమవంతులకు తెలియజేస్తూ వస్తున్నారు. కొన్నాళ్ళ తర్వాత పార్వతి పర్ణాలను కూడా తినడం మానివేసి నిరాహారంగా తపస్సు చేస్తూ, అపర్ణ అని పేరు పొందింది.

శివుడు మన్మథుణ్ణి భస్మం చేశాడే గాని, మన్మథుడి బాణ ప్రభావం ఊరికే పోలేదు.



పార్వతి తపస్సు కూడా ఫలితం సాధించింది. శివుడు మారువేషంతో పార్వతి దగ్గరకు వెళ్ళి, పార్వతి మనస్సును పరీక్షించాడు. పార్వతిని మనసారా మెచ్చుకొని పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. సప్త ఋషులను హిమవంతుడి దగ్గరకు పెళ్ళిపెద్దలుగా పంపించాడు. శివుడంతటివాడికి కన్యాదాత కాబోతున్నందుకు ఉన్నతోన్నతంగా శిఖరాలు పెంచుకున్నాడు హిమవంతుడు.

ప్రమథగణాలు ముందు నడవగా శివుడు పెళ్ళికుమారుడై హిమవంతుడింటికి తరలి వెళ్ళాడు. హిమాలయ శిఖరాలు పెళ్ళి పంది రికి రాటలైనాయి. విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలుగాగల దేవతలు, సప్తర్షుల వెంట వేలాది మహర్షులు, నారదాది మునిపుంగ వులు అక్కడకు చేరుకున్నారు. పెద్ద ముత్త యిదువ అరుంధతి శివుడి ఫాలనేత్రం రెప్ప మీదుగా కళ్యాణ తిలకం నిలువుగా దిద్దింది. పెళ్ళి అలంకరణతో శివుడు చాలా సుందరంగా తయారయ్యాడు. అప్పుడు అందరూ శివుణ్ణి– సుందరేశ్వరుడు అని అన్నారు.

సర్వాలంకార శోభితమై విద్యుల్లతలాగా మెరిసిపోతూన్న పార్వతిని పెళ్ళికూతురుగా తీసుకొచ్చి విష్ణువు శివుడితో, ''నీవు సుందరే శ్వరుడివి అయితే, నా చెల్లెలు పార్వతి మీనాక్షీదేవి!'' అని అంటూ పార్వతి కుడిచేతిని శివుడి కుడిచేతిలో పెట్టి ఇద్దర్నీ పెళ్ళిపీటల మీద కూర్చోబెట్టాడు.

శివపార్వతుల వివాహం ఎంత వైభవంగా జరగాలో అంత వైభవంగా జరిగింది.

హిమాలయ లోయలో శివుడు, పార్వతి తపస్సులు చేసిన చోటనే దేవశిల్పి విశ్వకర్మ కొత్త దంపతులైన పార్వతీపరమేశ్వరుల కోసం ప్రత్యేకంగా దివ్యమైన అంతఃపుర మందిరాన్ని నిర్మించాడు.

మంగళ తూర్యనాదాలు మిన్నంటుతూం డగా చేతులు కలుపుకుని శివుడు, పార్వతి అందరిమధ్య నడుస్తూ మందిరానికి బయలు దేరారు. మందిరాన్ని చేరుకునే దారిలోనే మన్మథుడి భస్మరాసి ఉన్నది. ఆ బూడిద కుప్పను అంటిపెట్టుకొని రతీదేవి కన్నీళ్ళతో మోకరిల్లి దోసిలిపట్టి పతిభిక్ష అడుగుతున్న దానిలాగ ఉన్నది.

శివ పార్వతులు ఆమె దగ్గరకు వెళ్ళి, ఆమె తలపై చేతులుంచి దీర్ఘసుమంగళిగా ఉండు అని దీవించారు. శివుడు మళ్ళీ తన మూడో కంటినే తెరచి ఈసారి చల్లని వెన్నెల కాంతితో చూడగానే భస్మరాసి మాయమై మన్మథుడు నిజరూపంతో లేచి అందరికీ కనిపించి,

చెరుకువింటి నారిని ఝుమ్మనిపించి అదృశ్య మైయ్యాడు.

అప్పుడు శివుడు రతీదేవితో, ''అమ్మా! నీ భర్త తిరిగి జీవించాడు. నీకు ఎప్పటిలాగే సదా కనబడుతూనే ఉంటాడు. నీ రెండు కళ్ళకు తప్ప మరే మూడో కంటికీ కనిపించడు. నీకు తప్ప ఇతరులకు కనిపించడం అతని ఇష్టంపైనే ఉంటుంది. అలాంటి వరాన్ని అతనికి ఇస్తున్నాను!'' అని చెప్పాడు.

పార్వతీ శివులు గృహప్రవేశం చేశారు. అరుంధతి నూతన దంపతులకు ఎర్రనీటితో దిష్టి తీసి, కర్పూరహారతి పట్టింది. అప్పుడు విశ్వకర్మ తెరతో నిండా కప్పబడివున్న ఒక నిలువెత్తు పలకను పార్వతీ శివుల ఎదురుగా నిలబెట్టి, ''ఇది ఒక గొప్ప అపురూప చిత్ర పటము. ఈ చిత్రంలో ఇద్దరు చిత్రింప బడిఉన్నారు. ఆ ఇద్దరిలో ఎవరి సౌందర్యం ఎక్కువ గొప్పదో మా బోటివారికి ఎవ్వరికీ చెప్పశక్యం కాలేదు! అది చెప్పగలవారు మీరిద్దరేనన్న నమ్మకంతో మీ ముందు పెడుతున్నాను, చెప్పండి!'' అని తెరను తొలగించాడు.

అది ఒక నిలువుటద్దం! అద్దంలో శివుడు పార్వతి తమ ప్రతిబింబాలను చూసి ముసి ముసిగా నవ్వుకున్నారు. ''ముసిముసి నవ్వులు సమాధానాలు కావు, చెప్పి తీరాలి!'' అన్నాడు నారదుడు.

శివుడు చిరునవ్వుతో పార్వతిని క్రీగంట చూస్తూ, ''ధగధగా శుక్రునిలాగ మెరు స్తూన్న ముక్కరగల చిత్రాంగి సౌందర్యమే గొప్పది!'' అన్న వెంటనే పార్వతి సిగ్గుతో ఎర్ర బడ్డ చెక్కిళ్ళతో, ''ఆ ముక్కంటి పురుషుడి



సౌందర్యమే సృష్టిలో గొప్పది,'' అని వీణ మీటినట్టు పలికింది.

అందరూ శివపార్వతులపై పుష్పాక్షతలు చల్లివెళ్ళిన తర్వాత కొత్త దంపతులిద్దరూ పట్టుదిళ్ళు అమర్చిన తూగుటుయ్యాలపై కూర్చున్నారు.

వారికెదురుగా విశాలమైన గోడమీద మనోహరమైన పెద్ద చిత్తరువు చిత్రింపబడి ఉన్నది. చిత్రం మధ్యలో అందమైన ఒక ఏనుగుల జంట నాట్యం చేస్తున్నట్లుగా ముందరికాళ్ళు ఎత్తి ఎదురెదురుగా ఎత్తిన తొండాలను పెనవేసుకొని ఉన్నవి. తోరణం కట్టినట్టు ఉన్న ఆ రెండు ఏనుగుల మధ్య నుంచి కనిపిస్తున్న సరోవరంలో పెద్దపద్మము వికసిస్తూన్నది. ఆ చిత్రంలో చిత్రింపబడిన ఏనుగుల జంటపై శివపార్వతుల చూపులు నిలిచాయి. అంతలో పద్మ చిత్రమున్నచోట

వెన్నెలవంటి జ్యోతి వెలిగింది. ఆ వెలుగు క్రమక్రమంగా పెద్దదై వ్యాపించింది. ఆ వెలుగులో శశివర్ణంతో మెరిసిపోతూన్న విఘ్నేశ్వరుడు వారికి కనిపించాడు.

విఘ్నేశ్వరుడి ముఖము ఏనుగు ముఖమే అయినప్పటికీ, ఆ ముఖంలో దివ్యత్వం నిండి ఉన్నది. ప్రసన్నత వెల్లివిరుస్తూన్నది. అతని చూపులు శాంతంగా మేధస్సునూ, శక్తినీ చాటుతున్నాయి. అతని దోరపుబొజ్జ నిండుగా తళతళలాడుతున్నది. అభయహస్తంతో అందంగా నిల్చొనిఉన్న విఘ్నేశ్వరుడు పార్వతికి ముద్దుల మూటలాగ కనిపించాడు.

విఘ్నేశ్వరుడిని చూస్తూంటే శివుడికీ, పార్వతికీ ఎన్నడూ ఎరగని అనిర్వచనీయమైన ఆనందమేదో తమలో ఉప్పొంగుతున్నట్టు అనిపించింది.ఆ ఆనందపారవశ్యంలో నోట మాట రాక విఘ్నేశ్వరుణ్ణి రెప్పవాల్చకుండా చూస్తున్నారు. విఘ్నేశ్వరుడు ఎడమ పక్కకు సొంపుగా వంపుపెట్టి ఉన్న చిన్నారి తొండాన్ని సవరించుకుని ఊపుతూ, ముద్దు ముద్దు మాటలతో, "నేను విఘ్నేశ్వరుణ్ణి! విఘ్నాలను అరికట్టే వినాయకుడిని! పంచ భూతగణాలకు అధిపతిని! గణపతిని! చిత్రవిచిత్రమైన రూపం గల చిత్రగణపతిని! మీ ఇరువురి అనురాగ ఫలితంగా శివుడి తేజస్సుతో కుమారస్వామి పుట్టి తారకాసురుణ్ణి అంతమొందిస్తాడు. కుమారస్వామికి ముందుగా నేను అవతరించి మీకు పుత్రుడిగా ఉంటాను. పుత్రగణపతినై అవతరించబోతున్నాను!'' అని చెపుతూంటే పార్వతి అతణ్ణి అందుకొని ఎత్తుకోవాలని చేతులు చాచింది. విఘ్నేశ్వరుడు వెలుగుతోసహా అంతర్ధానమయ్యాడు.

శివుడు, పార్వతి ఆ మందిరంలో ఆనంద సముద్రంలో మునిగి సంసారం సాగిస్తున్నారు. ఆ సమయంలోనే జగత్తుకు కనీవినీ ఎరగని ఉపద్రవం ముంచుకొచ్చింది.





# భవిష్యవాణి!

చంద్రగిరి రాజు చతురవర్మ ఎప్పుడూ నవ్వుతూ, నలుగురినీ నవ్విస్తూండేవాడు. జీవితకాలం అతి స్వల్పమనీ, దానిని అన్ని వేళలా ఆనందంగా గడపాలనీ, ఆయన అభిప్రాయం. ఆయన అనునిత్యం జీవితంలో కొత్తదనం కోరుకునేవాడు.

ఒకనాటి సాయంకాలం రాజూ, రాణీ ఉద్యానవనంలో విహరిస్తున్నారు. ఉన్నట్టుండి చతురవర్మ, రాణీకేసి తల తిప్పి, "ఇవన్నీ మనం రోజూ చూసే చెట్లూ, పువ్వులూ, అంతేగదా! కొత్తదనం కోసం ఏవైనా కమ్మని కబుర్లు చెప్పు," అన్నాడు.

భర్తమాటలకు రాణి చిన్నగా నవ్వి, "ఇది మరీ బావుంది! రోజూ మీ కోసం కొత్తకొత్త కబుర్లు నేనెక్కడినుంచి మోసుకురాగలను," అన్నది.

రాజు కొద్దిసేపు ఏదో ఆలోచిస్తూ ఊరు కుని, "చూడు, మనకు ఈపూట ఆ తోటమాలితో కాలక్షేపం," అని దూరంగా చెట్లపాదుల్లో పనిచేసుకుంటున్న తోటమాలిని చప్పట్లు చరిచి పిలిచాడు.

తోటమాలి పరుగున వచ్చి, ఆయన ముందు చేతులు కట్టుకుని నిలబడ్డాడు. రాజు తనమెడలోని ముత్యాలహారం తీసి వాడిచేతిలో పెట్టాడు. అనుకోకుండా లభించిన అంత విలువైన బహుమతికి, తోటమాలి ఏమిచేయ బోతాడో చూడాలని రాజు ఆలోచన. అయితే, తోటమాలి హారాన్ని దుస్తుల్లో దాచుకుని, అక్కణ్ణించి వెనుదిరిగాడు.

తోటమాలి ప్రవర్తనకు నిర్ఘాంతపోయిన రాజు, "ఒరే, నీకు ఎటువంటి కారణం లేకుండానే వేల విలువచేసే హారం బహూక రించాను. అయినా నీకు రవ్వంత ఆశ్చర్యం, ఆనందం కలిగినట్టులేదు! ఎందువల్ల?" అని అడిగాడు.

"ప్రభూ! మీరు ఈ రోజో రేపో హారం ఇస్తారని, నాకు ముందే తెలుసు," అన్నాడు తోటమాలి.

మాచిరాజు కామేశ్వరరావు



ఆ జవాబుకు ఆశ్చర్యపోయిన రాజు, "ముందే తెలుసా? ఎవరు చెప్పారు?" అని అడిగాడు.

"ఒక మునీశ్వరుడి భవిష్యవాణి, ప్రభూ!" అంటూ తోటమాలి ఇలా చెప్పాడు:

నాలుగు రోజుల క్రితం వాడు తూర్పు కొండల్లో వున్న తన స్వగ్రామానికి వెళ్ళాడు. ఆ కొండప్రాంతాలకు ఒక మునీశ్వరుడు వచ్చాడనీ, ఆయన పలికే భవిష్యవాణి అక్షరాలా జరిగి తీరుతుందనీ గ్రామస్థులు తోటమాలికి చెప్పారు. వాడు, ఆ మునిని చూడబోయాడు. వాణ్ణి చూస్తూనే ముని, చేతిలోని దండాన్ని పైకెత్తి పట్టుకుని, "అదృష్ట జాతకుడివి, నాయనా! అతి త్వరలోనే, మీ మహారాజు చతురవర్మ, తన మెడలోని హారాన్ని నీకు బహూకరించబోతున్నాడు," అని చెప్పాడు.

తోటమాలి, రాజుకు ముని మాటలు చెప్పి, "ప్రభూ! అందువల్లనే, తమరు చప్పట్లు చరిచి నన్ను పిలిచినప్పుడే, హారం ఇవ్వబోతున్నారని గ్రహించాను," అన్నాడు.

వాడి మాటలకు రాజు నివ్వెరపోయాడు. రాణి ఉత్సాహంగా, "మనం కూడా వెళ్ళి, ఆ మునీశ్వరుణ్ణి దర్శించుకు వద్దాం," అన్నది.

రాజు ఏదో చెప్పబోయేంతలో తోటమాలి, "ఆయన ఆడవారికి దర్శనం ఇవ్వడు," అన్నాడు.

"అలాగా!" అని రాణి విచారపడి, రాజుతో, "మహామునులు ఒక్కొక్కసారి వింతగా ప్రవర్తిస్తారు. కారణం, మనబోటి సామాన్యులకు అర్థంకాదు. సరే, మీరువెళ్ళి ఆయన్ని దర్శించుకు రండి," అన్నది రాజుతో.

దానికి రాజు అయిష్టంగా, "దేవీ! ముందే మనకు భవిష్యత్తు తెలిసిపోతే, జీవితంలో సంతోషానందాలను అనుభవించలేం," అన్నాడు.

"అలా ఎందుకనుకుంటారు? జీవితాన్ని మరింత అందంగా మలుచుకోవచ్చు. మీరు వెళ్ళితీరవలసిందే!" అంటూ రాణి పట్టు బట్టింది.

ఇక చేసేదిలేక రాజు, ఆ మర్నాటి ఉదయమే రథంమీద ముని దర్శనానికి బయల్దేరాడు. ఆ సాయంత్రం ఆయన పుట్టెడు దిగులుతో తిరిగి వచ్చాడు. రాణి ఎంతగా అడిగినా జవాబు చెప్పలేదు. రాత్రి కంటిమీద కునుకులేదు. పట్టెడన్నం కూడా నోట పెట్టలేదు. నాలుగు రోజుల్లోనే చిక్కి శల్యమయ్యాడు.

"మీరేదో దాస్తున్నారు. ఆ మునీశ్వరుడు ఏమన్నాడు? జరిగిందేమిటో చెప్పకపోతే,

నామీద ఒట్టే!'' అంటూ రాజు చేతిని, తన తలమీద పెట్టుకుని గట్టిగా అడిగింది రాణి.

అప్పుడు రాజు హీనస్వరంతో జరిగిందంతా చెప్పాడు: రాజు పాదాలకు వజ్రాలు తాపడం చేసివున్న పాదరక్షలు చూస్తూనే ముని, ''రాజా, త్వరలో నీకు కాళ్ళకు పాదరక్షలు కూడా వుండని స్థితి రాబోతున్నది. పాదరక్షల కోసం 'దేహీ' అనవలసివస్తుంది. ఒకానొక కోయ యువకుడు తిరిగి నీకు కిరీటధారణ చేస్తాడు,'' అన్నాడు.

ముని మాటలకు రాజు వణికిపోయాడు. ఆయన కాళ్ళకింద భూమి బద్దలయినట్లుగా తోచింది. ఆయన నోరు మెదపలేదు. తిరిగి వచ్చేశాడు.

''దేవీ! ముని పలుకుల్లోని నిగూఢార్థం—త్వరలోనే మనమీదికి బలవంతుడైన రాజెవడో దాడి చేయనున్నాడన్నమాట! మనం పరాజయంపాలయి, కాళ్ళకు చెప్పులు కూడా లేకుండా అడవుల వెంట తిరుగుతాం. మళ్ళీ కోయల సహాయంతో మనం రాజ్యం తెచ్చుకోవడం ఎప్పటిమాటోమరి!'' అన్నాడు రాజు ఎంతో దిగులుగా.

ఇది విని రాణి బెంబేలు పడిపోయి, ''మీరు ఆ మునీశ్వరుణ్ణే, ఈ అనర్థం జరక్కుండా మార్గం చూపమని అడిగివుండవలసింది. ఏవైనా గ్రహశాంతులూ, పూజలూ, జపాలూ చేయవలసి వుంటుందేమో! మరొకసారివెళ్ళి ఆయన్ను అడగండి!''అని బలవంతం చేసింది.

మర్నాడు రాజు రథంలో ముని దగ్గరకు బయల్దేరాడు. అడవి దారిలో ఒకచోట పులి, లేడిని తరుముకు వస్తూ హఠాత్తుగా రథానికి ఎదురైంది. పులిని చూసి బెదిరిన రథం గుర్రాల్లో ఒకటి, రథాన్ని పక్కకు లాగింది. రథం దాపులనేవున్న బురదగుంటలోకి ఒరిగిపోయింది. రాజు రథంనుంచి జారిపడి నడుం



లోతు బురదలో కూరుకుపోయాడు. సారథి గుర్రం జూలుపట్టుకుని, దాన్ని నిలవరించ బోయి, అది గట్టిగా మెడ విదిలించేసరికి ఎగిరి బాట పక్కన పడిపోయాడు.

రాజు అతికష్టంమీద బురదగుంట లోంచి ఒడ్డుచేరాడు. ఆయన పాదరక్షలు గుంటలో ఎక్కడో కూరుకుపోయాయి. దారంతా ముళ్ళ పొదలు. అడుగుతీసి అడుగు వేయలేక రాజు, కాళ్ళీడ్చుకుంటూ రథంకేసి వస్తున్న సారథి నడిగి, అతడి పాదరక్షలు తీసుకున్నాడు.

ఆ సమయంలో విల్లంబులు ధరించిన కోయ యువకుడొకడు అటుగా వచ్చాడు. వాడు దూరంగా పొదలదగ్గర పడివున్న రాజు గారికిరీటాన్నిచూసి, దాన్ని చేతికి తీసుకుని, పైపంచతో దులిపి, దాన్ని రాజు తలపై పెడుతూ, "మహారాజా! తమకు దెబ్బలేమీ తగలలేదు గదా?" అని ఆతృతగా అడిగాడు.

రాజు లేదన్నట్టు తల ఆడించాక వాడు తన దారిన తాను పోయాడు.

ఒక అరగంటసేపట్లో సారథి రథాన్ని సిద్ధం చేశాడు. రాజు రథం ఎక్కి కూర్చుని, "ఇప్పుడు మన ప్రయాణం మునీశ్వరుడి దగ్గరకు కాదు, రాజభవనానికి. రథాన్ని వెనక్కు మళ్ళించు," అన్నాడు సారథితో.

చీకటిపడుతూండగా రాజు రాజభవనాన్ని చేరాడు. ఆయన మాసిపోయిన దుస్తులతో, నీరసంగా, నిరుత్సాహంగా తిరిగి రావడం చూసిన రాణి, ఆదుర్దాగా ఏం జరిగిందని అడిగింది.

రాజు, ఆమెకు అడవిలో జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పి, "ఆ మునీశ్వరుడి భవిష్యవాణి అమోఘం అనడంలో ఎలాంటి సందేహానికీ తావు లేదు. ఆయన చెప్పింది అక్షరాలాజరిగిందిగదా! అయితే, జరగబోయేది పరిపరి విధాలుగా ఊహించుకుంటూ, నాలుగు రోజులుగా నేను అనుభవించిన నరకం పగవాడిక్కూడా వద్దు. భవిష్యత్తు తెలియకపోవడమే జీవితంలో ఆనందానికి ముఖ్యకారణం!" అన్నాడు.

రాణి అవునన్నట్టు తలాడించి, "ఇంత అతి స్వల్పమైన వాస్తవం అర్థంచేసుకోవడానికి, మీరెన్ని బాధలకు గురయ్యారు; నేనెంత ఆదుర్దాకు లోనయ్యాను!" అంటూ ఫక్కున నవ్వేసింది.





# పాలేరు చెప్పిన పాఠం

పేరిశాస్త్రి ఉపాధ్యాయుడుగా, ఆరోజే పదవీ విరమణ చేశాడు. అప్పుడు జరిగిన సన్మాన సభలో వక్తలు, పేరిశాస్త్రి జ్ఞానం అపారమనీ, అటువంటి మేధాసంపన్నుడు, ఆ చుట్టు పక్కల గ్రామాల్లో ఎవరూ లేరనీ వేనోళ్ళ పొగిడారు. ఆ మాటలు విని పేరిశాస్త్రి పరమానందం చెందాడు.

ఆ సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చిన పేరిశాస్త్రి, సభలో తనకు వేసిన పూలదండనూ, కప్పిన పండితశాలువానూ భార్య అలివేలు చేతికిస్తూ, సంతోషంగా సభా విశేషాలు చెప్పి, ''ఈ రోజు సన్మానసభలో వక్తలు నన్ను ఎంతో పొగిడారు. నా మేధా సంపత్తిని ఎంతగానో మెచ్చుకున్నారు. అయినా, నాకో అనుమానం, అలివేలూ! నేనింత మేధాసంపన్నుడినయినా, నా తరగతిలో ఎప్పుడు చూసినా విద్యార్థులు పలచగానే వుండేవారు. దానికి కారణం ఏమంటావు?'' అని అడిగాడు కాస్త విచారంగా.

''చింతబరికెలతో పిల్లల్ని చావబాదే వారేమో!'' అన్నది అలివేలు.

''ఛ,ఛ! నేనేనాడూ బరికె కాదు గదా, పేంబెత్తంకూడా చేతబట్టిన పాపాన పోలేదు,'' అన్నాడు శాస్త్రి.

''అయితే, మెలితిప్పిన ఆ దుబ్బు మీసాలు చూసిపిల్లలు హడలిపోయేవారేమో. అంతెందుకు, నేనే వాటిని చూసి దడుసుకుని, పెళ్ళి పీటల మీంచి పారిపోవాలనుకున్నాను,'' అంటూ నవ్వింది అలివేలు.

ఆ మాటకు శాస్త్రి కూడా నవ్వుతూ, ''అలాంటిదేం కాదనుకుంటాను. నాకు తెలియడంలేదు గానీ, మరేదో కారణం ఉండాలి,'' అన్నాడు.

పదవీ విరమణ తర్వాత, ఆ పట్నంలో ఖర్చులకు తట్టుకోవడం కష్టమని, నెల తిరక్కుండానే తమ సొంత ఊరుకు మకాం మార్చేశాడు శాస్త్రి. అక్కడ ఉదయం భోజనం చేసినప్పటి నుంచీ, రాత్రి పడుకోబోయేదాకా

''తంపు''



రకరకాల పుస్తకాలు చదువుతూ కాలం గడపసాగాడు.

ఇదంతా చూసిచూసి ఒకరోజున అలివేలు, ''జ్ఞానాన్ని నిరంతరం పోగుచేసుకుని ప్రయోజనం ఏముంది? నలుగురికీదాన్ని పంచినప్పుడే సార్థకత! ఎంత పంచిపెట్టినా తరగకుండా పెరిగే ఆస్తి జ్ఞానమేనంటారు. ఈ ఊళ్ళో అక్షరం ముక్క రాని వయోజనులు, చాలామంది వున్నారు. వాళ్ళకు చదువుతో పాటు, నాలుగు ఉపయోగపడే మాటలు చెప్పండి. వాళ్ళు బాగుపడతారు. మీకు పదిమందిలో మంచి పేరుతో పాటు, కాస్తంత పుణ్యం కూడా దక్కుతుంది!'' అన్నది.

శాస్త్రికి ఆ ఆలోచన నచ్చింది. ఊరి పాఠశాలభవనంలో, చదువురాని పెద్దలకు ఉచితంగా విజయదశమి రోజు నుంచి, తాను పాఠాలు చెబుతానని, అందరికీ స్వయంగా వెళ్ళి చెప్పివచ్చాడు.

విజయదశమి రానేవచ్చింది! శాస్త్రి రాత్రి భోజనం చేశాక, పట్టుపంచ కట్టుకుని, రెండు చేతుల నిండుగా పుస్తకాలు తీసుకొని పాఠశాలకు బయలుదేరి వెళ్ళాడు. అయితే, ఆయన పాఠాలు వినడానికి, ఆ ఊరి పెద్ద రెడ్డిగారి పాలేరు వెంకయ్య ఒక్కడే వచ్చి కూర్చుని వున్నాడు.

శాస్త్రి ప్రాణం ఉసూరుమంది. ఇంకా ఎవరైనా వస్తారేమో అన్న ఆశతో చాలాసేపు ఎదురు చూశాడు. అయినా ఎవరూ రాలేదు. ఆయన వెంకయ్యతో, ''నీకొక్కడికే ఏం పాఠం చెప్పేది, వెళతాను,'' అంటూ తిరిగి వెళ్ళిపోబోయాడు. అయితే, వెంకయ్యశాస్త్రికి అడ్డుపడి, ''గురువుగారూ, ఇది వినండి! నేను కొట్టంలోకి దాణా వేయడానికి వెళ్ళినప్పుడు, ఐదు గేదెలు ఎటో వెళ్ళి, దూడ ఒక్కటే వుంటే తిరిగి వచ్చెయ్యను. ఆ దూడకు తప్పకుండా దాణా పెడతాను!'' అన్నాడు.

వాడిమాటల్లోని భావాన్ని గుర్తించిన శాస్త్రి, చదువుపట్ల వాడికున్న ఉత్సాహానికి ఆనంద పడి, వాడికొక్కడికే ఎంతో శ్రద్ధగా ఎన్నో విషయాలు చెప్పాడు. తను వెంట తెచ్చిన పుస్తకాల్లోని వింతలూ, విశేషాలూ వివరించాడు. అక్షరాలు కూడా దిద్దించి, అర్ధరాత్రి కావస్తూండగా, మంచిపని చేశానన్న తృప్తితో ఇంటికి తిరిగి వచ్చాడు.

మర్నాటి రాత్రి మరిన్ని పుస్తకాలు తీసుకుని, పాఠశాలకు వెళ్ళాడు, శాస్త్రి. చిత్రంగా, ఆరోజు పాఠం వినడానికి వెంకయ్య కూడా రాలేదు. దానితో శాస్త్రి ఖస్సుబుస్సుమంటూ, అప్పటికప్పుడు రెడ్డిగారింటికి వెళ్ళి, పెరటి కొట్టంలో నిద్రపోతున్న వెంకయ్యను తట్టి లేపి, "ఒరే, అప్రాచ్యపు వెధవా! చదువుపట్ల నీ అభిమానం ఒక్క రోజుతోనే పోయిందా? నిన్న రాత్రి–కొట్టంలో దూడ ఒకటే వుందని అన్యాయంచేయను, దానికి దాణా పెడతాను; అంటూ లేనిపోని కబుర్లు చెప్పి పాఠం చెప్పించుకున్నావు. అంతటి ఉత్సాహం ఒక్క పూటతోనే నీరుగారిపోయిందా? ఈ రోజు పాఠశాలకేసి రావడమే మానేశావేం?" అంటూ ఆవేశంగా అడిగాడు.

దానికి వెంకయ్య ఎంతో వినయంగా చేతులు జోడించి, "గురువుగారూ, మన్నించండి! నేను దూడ ఒక్కదానికే దాణా పెడతానన్నానుగానీ, ఐదు గేదెల దాణా మొత్తం దాని చేతనే తినిపిస్తానని చెప్పలేదు," అన్నాడు.

ఆ మాటలు కొరడాదెబ్బల్లా తగిలాయి శాస్త్రికి. అప్పుడాయనకు తన తరగతిలో పిల్లలు ఎందుకు పలచగా వుండేవారో అర్థమైంది. బోధించేవాడు మహాజ్ఞాని అయి వుండొచ్చు. అపారమైన తెలివితేటలు కలవాడై వుండొచ్చు. అయితే, వినేవాళ్ళ స్థాయికి దిగివచ్చి పాఠం చెప్పినప్పుడే, అది ఎదుటి వారికి అర్థమవుతుంది. అంతేకాక, ఆ వినేవాళ్ళు ఎంతవరకు చెబితే అర్థం చేసుకోగలరో అంతవరకే చెప్పాలి!

ఆ క్షణంలో పేరిశాస్త్రి తన లోపం ఏమిటో తెలుసుకున్నాడు. ఆ తర్వాత, ఆ ఊళ్ళోని చదువురాని వయోజనులెందరో, ఆయన దగ్గర చదవా, రాయా నేర్చుకున్నారు.





# అహంకారం

కొత్తకోట గ్రామంలో శివజ్ఞాన పండితుడు అనే ఆయన ఉండేవాడు. ఆయన గొప్ప పండితుడూ, మహాజ్ఞానీ కూడానూ. ఆయనను ఆ గ్రామంలోనివారేగాక చుట్టుపక్కల ప్రజలు అందరూ ఎంతో గౌరవించేవారు. ఆయన ఇంట తరచుగా పండితచర్చలు జరుగుతూ ఉండేవి.

ఆయనకు పార్వతి అనే కుమార్తె ఉండేది. ఆమె కూడా మంచి విద్వాంసురాలు, ఏ విషయం చెవినపడినా వెంటనే గ్రహించేది. తండ్రి తన శిష్యులకు చెప్పే పాఠాలన్నీ శిష్యులు గ్రహించకముందే పార్వతి గ్రహించేది. కొంత కాలం ఇలా గడిచేసరికి తమ ఇంట్లో జరిగే పండిత చర్చలలో ఆమెకు అర్థంకానిదేమీ ఉండేది కాదు.

అన్నీ తెలిసిన శివజ్ఞానపండితుడంతటి వాడే తనకు తెలిసినది ఆవగింజలో అరభాగం కూడా లేదు అనుకునేవాడు. కాని పార్వతి మట్టుకు తనకు తెలియనిది ఏమీ లేదని గర్వపడేది. తనకన్న మూడింతలు వయసు గలవాళ్ళయినాసరే, ఏ సమస్య గురించి గాని చర్చించుకుంటూ ఉంటే పార్వతి తాను కలగజేసుకుని, వారి అనుమానాలకు సమాధానాలు చెప్పేసేది. రానురాను ఆమె పండిత గోష్ఠిలో కూడా తలదూర్చి, ఎవరైనా తప్పు చెబితే వారిని అప్పటికప్పుడే సరిదిద్దటమే గాక మరీ చులకనచేసి మాట్లాడే దశకు వచ్చింది.

పార్వతికి ఈ అహంకారం చిన్నతనం నుంచీ ఉన్నదే అయినప్పటికీ, చిన్నపిల్ల తనీడుకుమించిన తెలివితేటలు చూపుతూంటే తండ్రికీ, మిగిలినవాళ్ళకూ కూడా ముచ్చటగానే ఉండేదది. పెద్దదైతే ఆమెకు వివేకం వచ్చి, ఇలా ప్రతి విషయంలోకీ జొరబడటం తానే మానేస్తుందని తండ్రి అనుకున్నాడు. కాని ఆమె అహంకారం వయసుతో ముదురుతున్నది తప్ప, తగ్గే సూచనలు కనబడలేదు.

''నువ్వు పెద్దవాళ్ళ సంభాషణల్లోకి పిలవని పేరంటంగా జొరబడరాదు, తల్లీ,'' అని, శివజ్ఞానపండితుడు పార్వతికి చెప్పి చూశాడు.

''పాండిత్యానికీ, జ్ఞానానికీ వయసుతో ఏం సంబంధం, నాన్నా? ఎన్ని ఏళ్ళువచ్చినా శుంఠ శుంఠే,'' అనేది పార్వతి. తన తెలివి తేటలు అందరికీ తెలియటం తండ్రికి ఇష్టం లేదేమోనని కూడా ఆమె లోలోపల అనుమా నించేది.

పార్వతికి పదిహేనో ఏడు కూడా వచ్చింది. అయినా ఆమె అహంకారం ఏమాత్రమూ తగ్గలేదు. శివజ్ఞాన పండితుడు అన్నీ తెలిసిన వాడై ఉండి కూడా, తన కుమార్తెను మార్చడం ఎలాగో తెలియక, సతమతమయ్యాడు. తన బాధను తోటివారయిన కొందరు పెద్దలతో చెప్పుకున్నాడు.

ఇంతలో నవరాత్రి ఉత్సవాలు వచ్చాయి. రాజభవనంలో జరిగే పండితగోష్ఠికి పిలుపు రాగా శివజ్ఞానపండితుడు వెళ్ళిపోయాడు. ఆయన లేకపోయినా, పండితులు ఆయన ఇంట గోష్ఠి జరుపుతూనే వచ్చారు. వారి గోష్ఠిలో పార్వతి ఎప్పటిలాగే తలదూర్చు తూనే ఉన్నది.

ఒకనాడు పార్వతి వింటూండగా పండి తులు తమలోతాము ఒక వింత విషయం చెప్పుకున్నారు: పాత చెరువుగట్టున ఉన్న మండపంలో ఎవరో ఏదో రాశారట. దాన్ని చదవలేక ప్రతి ఒకరూ తలలు దించేసుకుని, వెళ్ళిపోతున్నారట.

ఈ మాట వినగానే పార్వతి, ''దాన్ని నేను చదువుతాను! ఎంత కష్టమైనాసరే! ఒకరు రాసి నది చదవలేకపోతే నేను శివజ్ఞానపండితుడి కూతురినే కాను!'' అన్నది చాలా దర్పంగా.



మండపంలో రాసి ఉన్నది పార్వతి చదవబోతున్నదన్న వార్త క్షణంలో ఊరంతా పాకింది. ఊళ్ళో వాళ్లంతా అమితోత్సాహంతో మండపం వద్దకు చేరారు. పార్వతి వచ్చి, హడావుడిగా గోడకు కట్టిఉన్న తెర తొలగించి, అక్కడ రాసి ఉన్నదాన్ని గడగడా ఇలా చదివింది:

"చెయ్యగలవాళ్ళే దీన్ని పైకి చదవాలి. ఈ చెరువులో పది అడుగుల బురద పేరుకుని ఉన్నది. నేను ఇప్పుడే పారా, బుట్టా తీసుకుని, తిన్నగా అక్కడికి వెళ్ళి ఒంటరిగా ఈ బురద అంతా తీసేస్తాను, అందుకు మీరందరూ సాక్షులు."

ఆమె చదవటం పూర్తిచెయ్యగానే ఎవరో ఆమె ముందు పారా, బుట్టా తెచ్చిపెట్టారు.

"ఇవి ఏమిటి?" అన్నది పార్వతి ఆశ్చర్యంగా.

"చూస్తూంటే తెలియడం లేదా? పారా, బుట్టా తల్లీ. వాటిని తీసుకుపోయి చెరువులో బురద తీయి," అన్నారు అక్కడివాళ్ళు.

"నేను చదువుతానన్నాను గాని, పని చేస్తాననలేదే?" అన్నదామె.

"మేమంతా చదవలేని శుంఠలమా, తల్లీ? దాన్ని చదివి వినిపించినవాళ్ళు రాసినట్టు చెయ్యాలని అందులోనే స్పష్టంగా ఉన్నది గద! అందుకే ఎవరమూ ఆ రాసిన దాన్ని పైకి చదవలేదు. నువ్వు ముందూ వెనకా చూడకుండా తొందరపడి చదివేశావు. మారు మాట్లాడకుండా పారా, తట్టా తీసుకో. తప్పుతుందా మరి?" అన్నారు అక్కడి పెద్దవాళ్ళు.

పార్వతి తన స్థితికి బావురుమని ఏడ్చింది.

పెద్దవాళ్ళు ఆమెను ఓదార్చి, "తెలివితేటలను ఎప్పుడు బట్టితే అప్పుడు ప్రదర్శించగూడదు. దేనికైనా సరే సమయం సందర్భం అంటూ పాటించాలి కదా?" అని హితబోధ చేశారు.

శివజ్ఞానపండితుడు తిరిగి వచ్చేసరికి పార్వతి పూర్తిగా మారిపోయింది. ఆమె అహంకారాన్ని అణచటానికి పండితులైన తన మిత్రులు చేసిన యుక్తి గురించి విని, తన కూతురు మారినందుకు ఆయన ఎంతో సంతోషించాడు.




అజేయుడు గరుడుడు 12
చిత్రాలు: పాణి
చంద్రపురి రాజు ప్రాణానికి ఆపద రాకుండా, ఆదిత్యుడు ఆయన్ను రహస్యంగా తీసుకుపోయి సురక్షిత ప్రాంతంలో దాచి మారువేషంలో రాజ్యానికి తిరిగి వచ్చాడు. నరేంద్రదేవుడూ, అతని కుమారుడూ ఆయన్ను గుర్తుపట్టారు. రాజుగారి ఆచూకీ తెలుసుకోవడానికి నరేంద్రదేవుడు ఒక మాంత్రికుణ్ణి రప్పించాడు. రాజు ఒక జలపాతం పక్కన ఉన్నట్టూ అయన్ను ఒక గరుడ పక్షి కాపలా కాస్తున్నట్టూ మాంత్రికుడు చెప్పాడు.


మాంత్రికుడి నోటినుంచి గరుడుడు అనే మాట వినగానే నరేంద్రదేవుడు దిగ్భ్రాంతి చెందాడు.


గరుడుడు దయ్యమా?
కావచ్చు! చాలా శక్తివంతమైనది కూడా. దానిని గురించి మరింత తెలుసుకోవాలంటే–నా గురువు తాంత్రికవేత్తనే సంప్రదించాలి!


ఇవిగో బంగారు నాణాలు!కావలసినన్ని తీసుకో! వెంటనే వెళ్ళి ఆ తాంత్రిక వేత్తను వెంటబెట్టుకునిరా!
ఆయన చాలా వృద్ధుడు. దూరంలో అరణ్యం మధ్య ఉన్న ఒక లోయలో తంత్ర విద్యలను ప్రదర్శిస్తూ ఉంటాడు!


ఆయన నాగసర్పాల మధ్య ఒంటరిగా నివసిస్తూ ఉంటాడు. ఆయన పేరు నాగబంధు. ఆయన కొండ పాదతలంలో తన శిష్యులకు 'శ్రావణ' మాసంలో మాత్రం దర్శనమిస్తాడు.


ఆహా! ఇప్పుడు శ్రావణ మాసమే! నన్నిప్పుడే తాంత్రికుడి దగ్గరికి తీసుకుపో!
రవీంద్రా! నువ్విక్కడే ఉంటూ ఆదిత్యుణ్ణి ఒక కంట కనిపెట్టి ఉండు! నేను వెళ్ళి తాంత్రికవేత్తను కలిసి వస్తాను.


నరేంద్రదేవుడు కొండల కేసి వెళ్ళాక, రాజ భవనంలో...
ఏమిటా చప్పుడు? ఆహా! నాన్నగారి చిత్రపటం ఎందుకో అటూ ఇటూ ఊగిసలాడుతోంది!
చిత్రపటం వెనక కనిపించిన పేటికను ఆదిత్యుడు అందుకున్నాడు.


ఈక మెల్లగా గాలిలో తేలడం ఆరంభమయింది. ఆదిత్యుడికి క్రమంగా గరుడరూపం రాసాగింది.


రవీంద్రదేవుడు భవన కాపలా భటులను వెంటబెట్టుకుని ఆదిత్యుడి శయన మందిరాన్ని సమీపించాడు.
ఈసారి వాడు తప్పించుకోలేడు! బందీ అవుతాడు!


శయనమందిరం తలుపులు ఉన్నట్టుండి తెరుచుకున్నాయి. వచ్చినవాళ్ళందరికీ బలమైన దెబ్బలు తగలడంతో దిక్కుకొకరు పారిపోయారు.
ఆ... ఏమిటీ వింత కాంతి? కళ్ళుపోయేలా ఉంది! ఒక్కటీ కనిపించడంలేదు!

మరికొంతసేపటికి రాజభవనంలో...
ఎలా తప్పించుకుని ఉంటాడు?
ప్రభూ! ప్రధానమంత్రి ఆయన భవనంలో లేరు!
ఆయన వెలుపలికి వెళ్ళలేదు. అదిమాత్రం మేం ఖచ్చితంగా చెప్పగలం, ప్రభూ!
మీరు సరిగ్గా వెతికి ఉండరు. పనికిమాలిన వెధవల్లారా!











# తోటివాడి సాయం

లక్ష్మీకాంతమ్మకు డెబ్బై ఏళ్ళ వయసు. పొరుగూరులో వున్న మనవడికి ఒంట్లో బాగాలేదని కబురు వచ్చింది. మిట్టమధ్యాహ్నపుటెండను కూడా లెక్కచేయకుండా, మనవణ్ణి చూడాలన్న ఆదుర్దాకొద్దీ హడావుడిగా బయల్దేరింది. కొంతదూరం వెళ్ళేసరికి మార్గమధ్యంలో సంత ఒకటి జరుగుతున్నది. సంతలో కొన్న ఎడ్లనూ, ఆవుల్లాంటివాటినీ కొందరు తోలుకుపోతూంటే, మరికొందరు అక్కడ అమ్మేందుకు తెస్తున్నారు. అంతటా జనం రద్దీ, పశువుల తొక్కిసలాట. కాలు కదిపి నాలుగడుగులు వేయటానిక్కూడా లక్ష్మీకాంతమ్మకు భయంగా వున్నది.

అంతలో ఒక పాతికేళ్ళవాడు జనం మధ్యనుంచి ఆమెకేసి వచ్చాడు. లక్ష్మీకాంతమ్మ వాడితో, "నేనీ సంత మధ్యనుంచి బయటపడి, మా కూతురున్న గ్రామానికి త్వరగా పోవాలి!" అన్నది, ఏమైనా సాయంచేస్తాడేమో అన్న ఆశతో.

"అయితే, నేను నీకు తోడుగా వుండనా?" అన్నాడు వాడు.

"అంతకన్నా కావలసిందేముంది, బాబూ! నువ్వు ముందు నడువు," అంటూ కాంతమ్మ వాడి చేయి పట్టుకున్నది.

వాడు అన్నిటికీ తెగించినవాడిలా, సంతకు అడ్డంపడి నడవసాగాడు. పశువుల్ని తోలుకుపోతున్న వాళ్ళూ, చిన్నచిన్న బళ్ళవాళ్ళూ, దుకాణాలవాళ్ళూ - వాణ్ణి, "అదేం పోకరా? ఏ బండి చక్రాలకిందో, పశువుల కాళ్ళకిందో పడిచావాలని వున్నదా?" అంటూ తిట్టసాగారు.

వాడదేమీ లెక్కచేయకుండా కొద్దిసేపటికి కాంతమ్మతోపాటు సంత అవతలకి చేరాడు. అంతవరకూ మౌనంగా వున్న కాంతమ్మ, వాణ్ణి, "ఏమిటి, గుడ్డివాడిలా నువ్వూ నీ నడకా? నేను ప్రాణాలతో ఈ సంతనుంచి బయటపడతాననుకోలేదు," అన్నది కోపంగా.

"అమ్మా, నేను గుడ్డివాణ్ణే! అందుకే తోడుగా వుండనా? అన్నాను," అన్నాడు ఆ గుడ్డివాడు.





వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 20వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు ఏప్రిల్ 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097.

## అభినందనలు

డిసెంబర్ 2001 సంచికలో బహుమతి
పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
వి.ముక్తేశ్వరరావు
37, అయ్యావు వీథి, జాఫర్‌ఖాన్ పేట,
చెన్నయ్-600 083.

బహుమతి పొందిన వ్యాఖ్యలు



మొదటి ఫోటో : చిన్నారి సింగారం!
రెండవ ఫోటో : చూపులకు బంగారం!!

చందమామ సంవత్సరచందా:
ఇండియాలో రూ.120లు
Payment in favour of CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

